విశ్వసాహిత్యమాల — 67.

# శ్రీ భద్రాచలక్షేత్రచరిత్రము

రచయిత:

శ్రీ కొండపల్లి రామచంద్రరావు.

1961 మే.

హిత్యమాల, రాజమండ్రి.

**Dr. Burgula Rama Krishnarao,**
GOVERNOR OF KERALA.

RAJBHAVAN.
TRIVENDRUM,
1-1-1957.

# ఆశీస్సు

"శ్రీ భద్రాచలక్షేత్ర చరిత్రము" యొక్క ప్రతిని కృతజ్ఞతతో నందుకొంటిని. ఉద్యోగరీత్యా భద్రాద్రి రాముని సేవ చేయుచున్న మీరు భక్తిపూర్వకముగా క్షేత్ర మాహాత్మ్యమును రచించి ఆంధ్రలోకమున కందజేయుట మిక్కిలి ప్రశంసార్హము. ఆంధ్రపత్రికలో ప్రకటింపబడినప్పుడు చదివితిని. వానిని పుస్తక రూపముగా ప్రచురించుట సమంజసమే కాక అత్యవసరము. అట్టి కార్యమును పూర్తిచేసిన మీకు నా అభివందనములు. ఆంధ్రదేశము రామభక్తికి ఆలవాలము. కావున మీ గ్రంథ మాంధ్రావనియొక్క ఆదరమును పొందునని విశ్వసించుచున్నాను.

రాజభవన్,
తిరువేంద్రం,
1–1–1957.

ఇట్లు,
బూర్గుల రామకృష్ణారావు,
కేరళ గవర్నరు.

GOVERNMENT OF ANDHRA PRADESH

GRANDHI VENKATA REDDY NAIDU, B. A., B. L.,
MINISTER FOR LAW.

KHAIRATABAD,
HYDERABAD.
*Dated 9-1-1957*

# తొలిపలుకు

భద్రాచల క్షేత్రమును గురించి, శ్రీసీతారామచంద్రుల మాహాత్మ్యమును గురించి, భక్తిశ్రద్ధలతో హృద్యముగా రమ్యమైన భాషలో, రచించిన శ్రీ కొండపల్లి రామచంద్ర రావుగారిని నే నెంతయో ప్రశంసించుచున్నాను. ఈ గ్రంథమును తొలుత ఆంధ్ర మహాజనులకు అందజేసిన శ్రీ ఆంధ్ర పత్రికాధిపతులను అభినందించుచున్నాను.

భక్తిప్రపూరితమైన ఈ గ్రంథము భక్తులందరి ఆదరాభిమానములను హెచ్చుగా పొందగలదని ఆశించుచున్నాను.

శ్రీ రామచంద్రరావుగారికి ఆధ్యాత్మిక ప్రబోధకమైన గ్రంథములను ఇతోధికముగా రచింపగల శక్తిని ఆ శ్రీరామ చంద్రమూర్తి యివ్వవలెనని ప్రార్థించుచున్నాను.

హైదరాబాద్,
9–1–1957.

ఇట్లు,
గ్రంధి వెంకటరెడ్డి,
న్యాయశాఖామంత్రి.

GOVERNMENT OF ANDHRA PRADESH

**D. SANJIVAYYA.**
MINISTER, SOCIAL WELFARE.

HYDERABAD
*Dated Jan. 9, 1957.*

# అభిప్రాయము

శ్రీ భద్రాచల క్షేత్ర చరిత్రము చదివే మహదవకాశం నాకు గల్గినందులకు సంతోషిస్తున్నాను. రచయిత శ్రీ కొండపల్లి రామచంద్రరావుగారు శ్రీరామభద్రుని పదసాన్నిధ్యమున నిశ్చలభక్తితో వ్రాసియున్నారు. వచన రచనకు వన్నె తెచ్చేవిధంగా యెల్లరకు రుచించేటట్లు రచించినారు. అనేక గ్రంథరాజముల పరిశీలించి విషయసేకరణయం దమితాసక్తి చూపియున్నారు. సహృదయులు, రసజ్ఞులు యీ గ్రంథమును ప్రశంసనీయమైన రచన యని మన్నించెదరని ఆశిస్తున్నాను. శ్రీ రామచంద్రరావుగారు మరికొన్ని యుత్తమ గ్రంథరచనలకు పూనుకొని ఆంధ్ర వాఙ్మయ చరిత్రయందు సుప్రసిద్ధులైన రచయితగా పేర్గాంచునిమిత్తం, నేను శ్రీ భద్రాచల రాములను ప్రార్థిస్తున్నాను.

హైదరాబాద్,
9-1-1957.

ఇట్లు,
డి. సంజీవయ్య,
సోషల్ వెల్ఫేరు శాఖ మంత్రి.



# అంకితము

క. నీ కథ నీకే యొసంగెద
నీ కథ ఆంధ్రావనీ సహృదయానేక
శ్రీకర మగుఁగాత ! సమి
ద్భీకర ! కరుణాపయోనిధీ ! దాశరథీ !





# ఇష్టదైవప్రార్థనము

“వామాంకస్థిత జానకీ పరిలసత్ కోదండదండాం కరే
చక్రం చోర్ధ్వకరేణ బాహుయుగళే శంఖం శరం దక్షిణే
బిభ్రాణం జలజాతపత్రనయనం భద్రాద్రిమూర్ధ్నిస్థితం
కేయూరాది విభూషితం రఘుపతింసౌమిత్రియుక్తం భజే॥”

(ఆదిశంకరులు)

“శ్రీరఘురామ! చారుతులసీదళదామ! శమక్షమాది శృం
గారగుణాభిరామ! త్రిజగన్నుతశౌర్య రమాలలామ! దు
ర్వారకబంధరాక్షసవిరామ! జగజ్జనకల్మషార్ణవో
త్తారకనామ! భద్రగిరి దాశరథీ! కరుణాపయోనిధీ!”

(రామదాసు)

ఎలమిన్ నన్ను విరోధివత్సర వికుంఠై కాదశీవేళ ను
జ్వల సాలంకృత వైనతేయ విపులస్కంధోన్నతారూఢ ని
స్తులశోభాపరిణాహముం గనుమటంచుం బిల్చికొన్నావు నీ
కలముం జేతికొసంగినావు, కరుణాకాకుత్స్థ ! రామప్రభో!

ధరణిని భద్రు బ్రోచుటయు దమ్మికి నేలుట రామదాసు సు
స్థిరతర సద్యశోవిభవశీలు నొనర్చుట తూము నారసిం
హు రుచిర సేవ లందికొని యొప్పగ లీనమొనర్చుకొంట నీ
పరమకృపానుభూతులను బల్కెడ నీకృపచేత రాఘవా !

ప్రీతి ముకుందమాలయును శ్రీనరసింహ కరావలంబ వి
ఖ్యాత నుతిం దెనుంగున జగత్ప్రథితంబగు సత్యసువ్రత
స్ఫీతకథాళి కృష్ణనుతి వెండియు స్తోత్రమునైన నీకథన్
జేతుల నందికొంటి విక జేకొను మియ్యది జానకిపతీ !





గ్రంథకర్త:

శ్రీ కొండపల్లి రామచంద్రరావు

# పరిచయము



1955 వ సంవత్సరము మార్చి నెలలో నేను సకుటుంబముగ శ్రీ భద్రాద్రిరాముని, భక్తవర్యుడగు శ్రీ రామదాసుగారిని సేవించుటకై భద్రాచలమునకు పోయియుంటిని. శ్రీరామచంద్రుని యొక్కయు, వారి భక్తుల యొక్కయు పాదసేవ నాకు లభించినది. ఈ సందర్భమునందు మా బాల్యమిత్రులగు శ్రీ కొండపల్లి రామచంద్రరావుగారిని చిరకాలమునకు మరల కలిసికొను భాగ్యముకూడ నాకు అబ్బినది. శ్రీ రామచంద్రరావుగారు వయస్సులో పెద్దలు కాకున్నను బుద్ధిసంపదచేతను, భగవత్కార్యములయందు గల శ్రద్ధాభక్తులచేతను వృద్ధులని నాకు తోచినది. నేను భద్రాచలమునందు గడపిన కొలది దినములలో శ్రీ రామచంద్రరావుగారు అప్పటికే తాము రచించియుంచిన భద్రాచలక్షేత్ర చరిత్రముయొక్క వ్రాతప్రతినుండి కొన్ని ఘట్టములను నాకు చదివి వినిపించిరి. అవి విని నేను చాల ఆనందించితిని. ఏతద్గ్రంథ ప్రచురణమునుగూర్చి శ్రీ రావుగారును నేనును కొంత ముచ్చటించితిమి. తరువాత ఈపుస్తకమును ప్రకటింపవలసినదిగా నేను కొందరు మిత్రులకు మనవి చేసియుంటిని. కాని తుదకు ఈ గ్రంథమును పుస్తకరూపమున ప్రకటించు గౌరవము విశ్వసాహిత్యమాలవారికి దక్కినది. భద్రాచల

క్షేత్ర చరిత్రమును వ్రాసిన శ్రీ కొండపల్లి రామచంద్ర రావుగారికిని, ఏతత్పుస్తక ప్రకటనభారము వహించిన విశ్వ సాహిత్యమాలా సంపాదకులును, అస్మత్సోదరులు నగు శ్రీ మహీధర జగన్మోహనరావుగారికిని శ్రీరామచంద్ర ప్రభువు దీర్ఘాయువును, సమస్తైశ్వర్యములను ఇచ్చి రక్షింపగలడని నాకు దృఢవిశ్వాసము కలదు.

ఈ ఉత్తమ కృతికి పరిచయము వ్రాయవలసినదిగా నన్ను శ్రీ రామచంద్రరావుగారు కోరినారు. ఈ పనికై నన్ను నియమించి రావుగారు నాకు చాల గౌరవము కల్గించి నారు. వారికి కృతజ్ఞుడను. ఈ చిన్న పుస్తకమునందుగల మాహాత్మ్యము చాల పెద్దది. విషయము శ్రీరామచంద్రు నికి నివాసమగు భద్రాచలక్షేత్రము. విషయ ప్రకటనము చేయువారు విద్యాధికులును, అంతకుమించి శ్రీరాముని యందు అపారమగు భక్తిశ్రద్ధలుగల శ్రీ రామచంద్రరావు గారు. రామభక్తి వారికి వంశపారంపర్యముగ లభించిన ధనము. శ్రీ రావుగారి జనకులు కొండపల్లి నారాయణదాసు గారు అమితమగు విష్ణుభక్తిగలవారు. ఇట్టి రామచంద్రరావు గారు రచించిన పుస్తకములోని ప్రాశస్త్యమును ప్రశంసింప బూనుట సూర్యుని కాగడాతో చూపుటవంటిది. కాని ఈ విషయమై రెండు అంశములు మాత్రము తెల్పెదను. రావు గారు ఆంగ్లము, ఉర్దూ, సంస్కృతాంధ్రములు చక్కగా అలవరచుకొన్న బుద్ధిశాలురు. అనేక గ్రంథములను పరికిం

చినవారు. లోకానుభవమును సంపాదించినవారు. కావున వారు భద్రాచలక్షేత్రమును గూర్చిన చారిత్రిక మతవిష యికాంశములను ఎంతో శ్రమపడి సంపాదించుటయేకాక, విషయములను సవిమర్శముగ విభజించి, పాఠకులకు విజ్ఞానా నందములు రెండును లభించు పద్ధతిపై అంశములను వ్యక్తీక రించినారు. రామచంద్రరావుగారికి శ్రీరాముని సేవయందు గల ఉత్సాహము అపారము. ఆ ఉత్సాహమే వారి భాష కొక ఉదాత్తత, అనర్గళధోరణిని కల్పించిన దని నా నమ్మ కము. భావ భాషా ప్రాశస్త్యములతో నొప్పుచున్న ఈగ్రంథ మును భక్తులును, చారిత్రికులును, స్వరాష్ట్రాభిమానముగల ఆంధ్రులందరును కూడ చదివి ఆనందింపగలరని నా దృఢ విశ్వాసము. శ్రీరాముడే మన కెల్లరకును ఆదర్శము. ఆయనకు జేజేలు అర్పింతము.

హనుమకొండ, ఓరుగల్లు,
31–12–1956.

ఖండవల్లి బాలేందుశేఖరం,
(ఆంగ్లోపన్యాసకుడు, ఓరుగల్లు కళాశాల)

# పీఠిక

శ్రీభద్రాచలమున కైదారు యోజనములలో (బయన్న గూడెం, ఖమ్మంమెట్టుజిల్లా) నివసించుచుండియు ముప్పదేండ్ల వఱకీ శ్రీరామదర్శనమే తనివిదీరఁ జేయఁజాలకుంటిని. కీడులో మేలన్నట్లు నైజాము ప్రభుత్వపు తుదిగడియలలో జరిగిన యలజడులలో ప్రవాస మొనరింపవలసివచ్చిన నాకు నిచ్చటికి రాగలుగుటయు, నిరంతర శ్రీరామసేవాభాగ్యము క్రీ॥ శ॥ 1950 సంవత్సరపు తొలినాటినుండి లభించుటయు నా జీవితాఖ్యాయికలోని మధురాతి మధుర ఘట్టము. విశేషించి పూజ్యశ్రీ విశ్వనాథవారి యాశీస్సులందిన నా స్తోత్ర రామాయణముఁగూడ నప్పుడే వెలువడుటయు, మరువఁ జాలను.

తొలుదొల్త యధికారపత్రమును గొని నేనిచ్చట ప్రవేశించునప్పటికి గోదావరియొడ్డున బూర్గంపాడు గ్రామమునసే కల్యాణరాముని సేవించి మరలుచున్న ఒకానొక భక్తకవిని సందర్శింపఁ గలిగితిని. వా రప్పుడు నే నతిథిగాయుండిన గృహస్థు నింటనే శ్రీరామ స్తవమును జేయుచుండిరి. నేవినిన తొలి పద్య మిచట నుదాహరింపక తప్పదు—

మ॥ అలముకోటికి నీదుదర్శనముఁ జేయన్వత్తు నేటేట యం
చలనాఁ డేను ప్రతిజ్ఞఁజేసితిని రానైతిన్ నిజాంరాజ్యమం

> దలి గఙ్గోర్విని యంతమాత్ర మదికీతఙ్బిబ్బుఁగల్గించి నా
> తలదిమ్ము నవ్వదిలింప పుస్తకముఁ జేఁదప్పింతె? రామప్రభూ!

ఇది విని దిగ్భ్రాంతుఁడనై వారిపరిచయభాగ్యము నందఁ గోరితిని. తణుకు తాలూకా రేలంగి గ్రామ నివాసులు శ్రీ తంగిరాల జగన్నాథశాస్త్రిగారుగా నెఱింగించి, నాయుదంత మును తెలిసికొనిరి. ఉభయులము సగోత్రీయులమే (శ్రీవత్స)! నేను వినిన పద్య సందర్భము సవిస్తరము దెల్పఁగోరఁగా లభించినంతవఱకు రామాయణములెల్లఁ బరిశీలించి "శ్రీ జగన్నాథరామాయణ" మను పేర కావ్యరచన సాగించుచు నేఁటికి కృతిపతి శ్రీ భద్రాచలరామునకు వినిపించుచుంటి ననియు, గత సంవత్సరమున రాజాలమికి నొక చిత్రచర్య జరిగెననియు తెలుపుచు, వా రొక బండిలో గ్రామాంతర మేగుచుండ నిద్రాముద్రితు లగుటయు, నేనైక వ్రాతప్రతి జారిపోవుటయు, గమ్యస్థానమున వివాహ వేదికవద్ద తమ సంచి వెదకికొనఁగా నిదిమాత్రము లేకపోవుటయు, నంత భద్రగిరి రామునిపై తైలధారావచ్ఛిన్నంబుగఁ బద్యధార నొలికింప సంకల్పించుటయు, శ్రీరామకృపచేఁ దుదకొకనాఁ డొక యాగంతుకునివలన కావ్యము పునఃప్రాప్తమగుటయు లోనుగాఁగల విషయములను కర్ణానందముగ గాన మొనర్చిరి. తమ ప్రయాణము మానుకొని మరల నా వెంటవచ్చి శ్రీ భద్రగిరి రాముని దర్శింపఁజేసిరి. నేటివఱకును నామైత్రి వర్ధిల్లుచు కావ్యశ్రవణము జరుగుచునే యున్నది. పాఠకలోక

మున కొక సంపుట మందినది. ఇంక నిక్కే మేధావు లెందఱి తోడనో నా కిచట మైత్రి సంఘటిల్లుచున్నది.

నే నీ యాలయ కార్యనిర్వాహకునిగా నియమింపఁబడి నప్పటినుండియు, నిచ్చటి క్షేత్రమాహాత్మ్యము స్థానిక చారిత్రిక విషయములు సమగ్రముగ లభింపకపోవుటచేఁ దగినంత కృషిఁజేసి క్షేత్రచారిత్రిక ప్రాముఖ్యతల నాంధ్రలోకమున వ్యాప్తినందించవలెనని యుబలాటబడి పరిశీలింప నారంభించితిని. ఎట్టకేల కిప్పటికిట్లు పూర్తియైనది. ఎంతవరకు కృతార్థుఁడ నైతినో పాఠకులే నిర్ణయింపవలయును. దాశరథీ శతకమును విడువఁజాలక యనుకరింపఁబూని 'దాశరథీ దయానిధీ' యను మకుటముతో పద్యరూపమున నిది వెలువరింపఁ దలంచి 40 పద్యములు వ్రాసితిని. కాని, యది సరిపడదని తోచి తుదకిట్లు గద్యాత్మకమే యొనర్చితిని—

హైదరాబాదులోని యాంధ్రపత్రిక ప్రత్యేక విలేఖరి శ్రీ పి. వేంకటరామశర్మగారిచ్చటకు విచ్చేసినప్పుడు నా యీ వ్రాతప్రతిని చదివి మిక్కిలి సంతోషించి నా యందెంతయో నవ్యాజమైన యాదరమును గనుపరచుటయేగాక, దీని నాంధ్రపత్రికకుఁ బంపఁగా వారును 28-9-56 తేదీ నుండి ప్రతి ఆదివారమును తమ పత్రికలో ప్రచురించిరి. శ్రీ శర్మగారికిని ఆంధ్రపత్రికాధిపతులకును నా హృదయ పూర్వకాభివందనములు. నాకిందుఁ తోడ్పడిన గ్రంథములు-

1. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము - ప్రథమ సంపుటము.
2. కృష్ణాజిల్లా మాన్యుయల్ - (ప్రతి నొసంగినవారు- శ్రీ యీచంపాటి అప్పలాచార్యులువారు, మైలవరం)
3. దాశరథీశతకము - కంచర్ల గోపన్న (రామదాసు)
4. భద్రగిరి మాహాత్మ్యము. (భల్లా పేరయ్యకవి)
5. శ్రీరామాభిషేకము. (వెంకటరామకవి-అముద్రితము.) మా జనకపాదులు శ్రీ నారాయణరావుగారిచే సంపాదితము.)
6. శ్రీ తూము నరసింహదాసు చరిత్రము. (తూము సీతారామకవి కృతము)
7. భద్రాచల రామచంద్ర మాహాత్మ్యము (శ్రీ తూము సీతారామయ్యగారు)
8 శ్రీ భద్రాచల క్షేత్ర మహాత్మ్యము (బ్రహ్మాండ పురాణాంతర్గతము - శ్రీ రామావఝుల రామశాస్త్రిగారిచే సంకలితము.)
9. భద్రాచల రామదాసు చరిత్రము - పాత్రప్రతి (సింగరదాసు)
10. సనదులు హుకుములు మొదలైనవి. శ్రీరామాలయార్చకస్వాములు నాకుఁ గనుపరచినవి.
11. శాసన స్తంభములు (భద్రుని కోవెల ఎదుట)
12. వరదరామదాసుగారి హుకుము - చూపించినవారు, శ్రీ అ. రామచంద్రాచార్యులుగారు.

ఈ విధముగ వ్రాయపడిన యేతద్గ్రంథకర్తలకును ప్రచురణకర్తలకును భద్రాచల శ్రీరామాలయార్చక సంఘమునకును మిక్కిలి కృతజ్ఞుఁడను.

ప్రతికాముఖమున దీని జదివినంతమాత్రమున మైత్రి పురస్కరించుకొని యీ నా చిన్ని హస్తమును ముద్రించి పాఠకలోకమున కందింతునని నాతో ముఖపరిచయమైన లేకున్నను 'విశ్వసాహిత్యమాల' వ్యవస్థాపకులు శ్రీ మహీధర జగన్మోహనరావుగారు నాకు వ్రాసి యెంతయో శ్రద్ధ వహించి యచిరకాలమున దీని వెలువరించిరి. వారి కెట్లు కృతజ్ఞత తెల్పవలయునో నాకే తెలియకున్నది. భద్రగిరి శ్రీ సీతారాముల కృపాకటాక్షము నిరంతరము వారియం దుండుగాతమని ప్రార్థింతును.

ఈ కావ్యకన్యకు పరిచయముం గూర్చిన శ్రీ ఖండవల్లి వారికి, ఆశీస్సు లొసగిన పూజ్యపాదులకును ప్రణామములు. సహృదయు లిందలి విషయములపై గమనార్హములగు సూచనలం దెల్పిన పునర్ముద్రణమున సవరించుకొందును.

ఇట్లు,

భద్రాచలం, 5-1-1957. } భాగవత శ్రీపాద పరమాణువు, కొండపల్లి రామచంద్రరావు.





మ్రొక్కిన నీకు మ్రొక్కవలె । మోక్ష మొసంగిన నీవ యీవలెన్
తక్కిన మాట లేమిటికి । దాశరథీ కరుణాపయోనిధీ !

# శ్రీ భద్రాచల క్షేత్ర చరిత్రము

## పురాణ ప్రసిద్ధి

నవభారత రాజ్యలక్ష్మికి బంగారు నొడ్డాణం బగు నాంధ్రరాష్ట్రమునఁ దూర్పుగోదావరీమండల కుండలం బన నొప్పు నీ భద్రాచలము ఇప్పుడు ఖమ్మంమెట్టుజిల్లాలో చేరినది. వేదకాలమునుండి నేటివరకు సకల పుణ్యముల కాలవాలమై, ముముక్షుజన సేవితంబై, ఐహికాముష్మిక ఫలప్రదంబై మహాక్షేత్ర మను ప్రశస్తిచే విరాజిల్లుచున్నది. తొలుత మన కీ విషయము బ్రహ్మాండపురాణమున గౌతమీ మాహాత్మ్యమునం దభివర్ణింపబడిన భద్రాద్రిక్షేత్ర మాహాత్మ్యము వలన దెలియుచున్నది. కొద్దిలో జెప్పవలెనన్న పర్వతశ్రేష్ఠుండగు మేరువు మేరుదేవింగూడి (మేనక యని గ్రంథాంతరము) పుత్రార్థియై పరమేష్ఠి నుద్దేశించి యనేక వర్ష సహస్రంబులు తపం బాచరించి కృతార్థుండై భద్రుడను పర్వతరాజంబును పుత్రునిగా బడసెను. భద్రుండును దండకారణ్యంబున గౌతమీ తీరమున నెలకొని యుండెను. శ్రీరామచంద్రుడు సీతాలక్ష్మణయుక్తుం డయి దండకలో సంచరించుచు నొకనాడు వాహ్యాళి బయలుదేరి యలసి

యచ్చోటికి వచ్చి, యించుక సేదదేఱ నాసీనుడయ్యెను. ఆ గిరిప్రస్తరసుఖస్పర్శచే ప్రభు డమందానంబు నొంది,-

"భవిష్యసి మహాత్మా త్వం భక్తోఽసి గిరిరూపభృత్,"

మహాత్మా! అచలరూపభక్తుండవు గమ్మని యను గ్రహించెను. నాటనుండి,—

"రామభద్రపదాంకత్వాత్ భద్రాద్రి రితి విశ్రుతః."

రామభద్ర పదచిహ్నితుం డగుటజేసి భద్రాచల మను ఖ్యాతి నొందెను. భద్రుడును ననేక వేల సంవత్సరంబు లుత్సహించి తప మాచరించి శ్రీరాముడు ప్రత్యక్షంబగు టయుఁ బరిణమిల్లి కీర్తించి, దర్శించువారలకు భుక్తి ముక్తి ప్రదుండై తనపై శాశ్వతముగ నెలకొని యుండుటయే తన యభీష్టముగ నెఱింగించెను. జగత్పితయుఁ బ్రీతుండై,-

"వసామి శిఖరే భద్ర! తవ యావద్ధరిష్యతి
భూమి ర్బూతాని కల్పాంతే మత్సాయుజ్య మవాప్స్యసి."

"కల్పాంతముపఱ కిట నధివసింపగలను. అనంతరమున నాలో నైక్యమగుదు"వని యానతిచ్చెను. తదాది భద్రాద్రి సర్వలోకపూజితం బయ్యెను.

"సంప్రాప్య రామనవమీం తులసీదళాద్యైః
సంపూజ్య భద్రగిరివాసిన మాదిదేవం,
కృత్వోపవాస మథ జాగరణం చ కృత్వా
సాక్షాత్పరం రఘుపతేః పరమం ప్రయాతి."

అని యుండుటంజేసి, విశేషించి శ్రీరామనవమినాటి

కల్యాణోత్సవము బహుసహస్రాధిక సంఖ్యాక మగు భక్తతతి కత్యంత సేవ్యంబై వెలయుచున్నది.

స్థలమా, భద్రుడు వేలకొలది వర్షంబులు తపం బొనరించుటచే పవిత్రీకృతమైనది. జలమా, మహర్షియగు గౌతమునిచే పుట్టుక కలిగి గంగయను నామాంతరమున భాసిల్లు గోదావరీ పవిత్రోదకము. దైవమా, కరుణాలవాలమగు శ్రీ సీతారామచంద్రమూర్తి. ఇట్లు పావనత్వమున ముమ్మూడియగు నిమ్మహాక్షేత్ర మాచంద్రార్కము భక్తజన సేవ్యమగుటలో సందియ మెక్కడిది ? పురాణప్రసిద్ధి బడసిన నీ క్షేత్రదైవతములను జనసామాన్యమున కందజేసినది శ్రీరామదాసుగారు. కనుక భద్రాచలక్షేత్ర చరిత్రము రామదాస చరిత్రముతోడనే ప్రారంభ మగుచున్నది.

## మార్గ సౌకర్యములు

ప్రథమమున భద్రాచలము జేరగలమార్గములం దెలుపవలసియున్నది. రాజమహేంద్రవరమునుండి వర్షకాల మాఱు నెలలు నదీమార్గమున రాకపోకలు జరుగును. ఎత్తైన కొండల నడుమ ప్రవహించు నదీయానమున ప్రకృతి సౌందర్యమాకర్షణీయముగ నుండును. చేరుటకు రెండుదినములు, వెళ్లుటకొక దినము పట్టును. ఇదిగాక విజయవాడనుండి హైదరాబాదునకు బోవు రైలుమార్గమున నొకజాము ప్రయాణమున

డోర్నకల్ 'జంక్షను' జేరి యచటనుండి బండి మారి భద్రాచలం రోడ్ (కొత్తగూడెం) యొక్క జాములో రావచ్చును. వెంటనే "గోమ్మూరు" అనబడు గోదావరీ తీర మొక గంటలో మోటారుపై వచ్చి, పడవ లేక లాంచివల్ల నదిం దాటి, యావలి యొడ్డునం గల భద్రాచలముం బ్రవేశింప వచ్చును. ఇంకను విజయవాడ, ఏలూరు, వరంగల్లు, ఖమ్మంమెట్టు, ఇల్లందు మొదలగు పట్టణములనుండి కొత్తగూడెము వరకు రోడ్డుమార్గములు, మోటారు సౌకర్యములు కలవు. ఎన్ని యున్నను సరాసరి రైలుమార్గము లేకపోవుటంజేసి "ఏజన్సీ" అని వ్యవహరింపబడు నీ పర్వతప్రాంతమున రాచ నగరుగా వెలయుచున్న భద్రాచలమునకు ప్రయాణ మొక ప్రయాసతో గూడినదే యగుచున్నది.

నలువ దేండ్లకు పూర్వ మీ ప్రయాణము మిక్కిలి నానందకరముగ నుండెడిది. దేశ దేశములనుండి ప్రజలు శ్రీరామచంద్రమూర్తిని కల్యాణోత్సవమున దర్శించుటయే తమ జీవిత పరమావధిగా దలంచి తండోపతండములుగ రైళ్ళలో విజయవాడనుంచి, సింగరేణి (ఇల్లందు) వఱకుం గల 'స్టేషను' లలో వీలైన చోటులం దిగి, కాలినడకను, రెండెడ్ల బండ్లపైనను, పయనించుచు వచ్చెడివారు. ఈ మార్గములం దెల్ల మైలు మైలుకు చలివేంద్రలు, ఐదారు మైళ్ళ లోగానే యన్నసత్రములు ద్రవ్యవంతులగు మహా దాతలచే తగినంత ముందుగా నెలకొల్పబడి, సమర్థులును

సేవాకాముకులు నగు భక్తవరులచే నడుపబడుచుండెడివి. ఆయా గ్రామీణులు తామెల్లరు సీతాకల్యాణమున జనక మహారాజు పక్షమువారమనియు యాత్రికులెల్లరు శ్రీ దశరథ మహారాజు పక్షమువారనియు భావించుకొని సంతోష సముద్రమున నోలలాడుచు దమ శక్తికొలందిగ నున్నతస్థాయిలో గ్రామము వెలుపల నెదుర్కొని, సకలోపచారములు జరిపి, తోడ్కొనివచ్చి, సత్రమున మజ్జనభోజనాదులచే సంతుష్టులం గావించి, సీమాంతమునకు సాగనంపుచుండెడివారు. ఈ విధముగ శ్రీ సీతారామకల్యాణోత్సవమున భద్రాచల మెంత నేత్రపర్వముగ నుండెడిదియో అంత కినుమడిగ దేశమెల్ల జనసామాన్యమున నానందము పరివ్యాప్తమై యుండెడిది. యాత్రికసంచారములు సద్దుమణగగనే గ్రామీణు లెల్లఱును భాగవతసేవారాధన విశేష మీ వర్షమున నేటితో పూర్తియైనదనియు, నిట్టి రామదాసభజనకీర్తనల శ్రవణానందముగ విను భాగ్యము, భజనసమాజములలో దాత్కాలికముగ జేరి నామస్మరణ మొనర్చు సదవకాశము, ఎండగొట్టుబడి వచ్చు స్త్రీ బాల వృద్ధ యోగిజనులకు నన్నపానాదులచే దత్కాల సంతృప్తి సేకూర్చి సేవించుపుణ్యములు మజల నొక సంవత్సరమునకు గదా యని తలపోసికొనుచు, నొక నెలదినము లిట్టి కథలచే బ్రొద్దుపుచ్చుకొనుచుండెడివారు. దీనివలనఁ బ్రజలలో నైతికాభివృద్ధి, మానవ సేవాభిలాష, ధర్మరంజకత్వము, త్యాగబుద్ధి, స్త్రీ బాలురలో గూడ వర్షైకవృద్ధిగ బ్రవర్ధ

మానము లయ్యెడివి. పలుచోట్ల బీదప్రజలు కనాయాసముగ హరికథా కాలక్షేపములు, పురాణశ్రవణములు సందర్భము లగుటంబట్టి, విద్యావివేకములు లభించినవని సంతోషించెడి వారు. యాత్రికులును జేబుఖర్చు తగులకయే పక్షముదినము లత్యుత్సాహమున యాత్ర జరుపుకొని, గ్రామీణులతో నూతన పరిచయభాగ్యము కలుగుట మఱచెడివారు కారు. ఈ విధముగ బ్రతివర్షమును దొలిపక్షము ఆంధ్రదేశవాసు లెల్లరకు సంతోషదాయకముగ గడచుచుండెడిది. నేటి కాలపు సులభప్రయాణమున వేగముగ వచ్చుటయు బోవుటయు సంభవములగుచున్నవి. కాని, వ్యయప్రయాస లధికమై నానాటికి నైతిక స్థితి, మానవ సేవాభిలాష వెనుకబడుచున్నవో యని ప్రాజ్ఞులకు సందియ మొదవకపోదు.

## భద్రుడు

తపోయోగసిద్ధులచే దమ శరీరములు శిలామయములుగా జేసికొని, శీతాతప క్రూరాసుర బాధల కతీతులుగ నెగడు మహాజీవులే సుప్రసిద్ధములగు కొన్ని పర్వతరాజము లందురు. దేవలోకమునకు జెందిన కైలాస, మేరు, మందర, ములు, మానవలోకమున దేవాయతనముల కాలవాలములైన శ్రీశైల, వేంకటాచల, వేదాచల, సింహాచల, భద్రాచలాదు లిట్టివే. మేరుసుతుం డగు భద్రుండు, గౌతమీతీర

మున ననేకవేల వర్షంబులు దపం బొనరింపఁ శ్రీరాముడు ప్రత్యక్షమై వర మనుగ్రహింప దలచుటయు, దర్శనమాత్రమున సకలజీవులు మోక్షసామ్రాజ్యము ననుభవింపగల విశేషము కలుగునట్లు శ్రీ సీతాలక్ష్మణసహితుడై తన శిఖరమున నెలకొనవలయునని భద్రుడు వేడుకొనుటయు, దేవు డనుగ్రహించి తదీయ వాంఛ నీడేర్చుటయు బురాణప్రసిద్ధములు. శ్రీరామచంద్రమూర్తి వామాంకమున సీతను వహింపుచు పద్మాసనమున దాను వేంచేసియుండి, వామపార్శ్వమున లక్ష్మణుడు ధనుర్బాణములతో నిలిచియుండ, భద్రాచలమున నధివసించెను. తా నిప్పుడు చతుర్భుజుడై వెలసెను. పై రెండు కరంబులందును శ్రీమన్నారాయణునివలె శంఖచక్రములఁ దాల్చెను. గాని విరోధుల, రాక్షసుల మట్టుపెట్టు పని గట్టుకెక్కినది. కనుక నిట్టులమగు ప్రేమతో భక్తుల కభయం బొసంగదలచి కాబోలు పరివర్తనముగా కుడిచేత శంఖమును, నెడమచేత చక్రమును నవధరించెను. రామచిహ్నములగు ధనుర్బాణములను దక్కిన వామదక్షిణకరంబుల దాల్చెను. కనుకనే వైకుంఠరాముడని, రామనారాయణుఁడనియుఁ బొగడొందెను. పరమాత్మ జీవాత్మలగు 'అ'కార 'మ'కార వాచ్యులు శ్రీరామలక్ష్మణులగు నసుమ, 'ఉ'కార వాచ్యయగు శ్రీ సీతామహాలక్ష్మి దృశ్యమాన యగుచుండుటచే, వేదముల తొలిమంత్రము 'ఓం'కార మీ మూర్తిత్రయమున విస్పష్టమగుచున్నది. కనుక నోంకారరాముడనియు కీర్తింప

బడును. ఈ మహాశృంగారమూర్తిని, కరుణారసము వెదజల్లు దేవదేవుని, రామదాసుగారు 'దాశరథి' యని వ్యవహరించి, దాశరథీశతక రచనచే భక్తిప్రవాహమున పాఠకుల నోలలాడించి, రామునకు రెండవసాటి దైవ మిక లేడని చాటినాడన్న నేతన్మాహాత్మ్యమును వివరించుట సామాన్యున కలవిగాదు. కుడివైపుగ లక్ష్మణుడుగల శ్రీరాముడు, భోగమోక్షకరుం డను శాస్త్రమర్యాద ననుసరించి, ఉత్సవమూర్తులందు సీతాలక్ష్మణు లిరువురు రామున కిరువైపుల గలరు. ఇట్లున్న నీ దేవాదిదేవులు మానవులవలన గుర్తింపబడక దండకారణ్యమున దేవఋషిగణములచే ననేక వేల వర్షము లారాధింపబడిరి.

శ్లో. స్నాత్వా ప్రాతస్సుబోధే దినకరదివసే గౌతమస్యాఘనాశే
ధ్యాత్వా సీతాసమేతం రఘుపతితిలకం భద్రమద్రిం ప్రణమ్య
గత్వా సంపూజ్య రామం గిరివరశిఖరే సీతయా సన్నివిష్టః
భుక్త్వా భోగా నభీష్టా నమరవరసుఖం ముక్తి మంతే ప్రయాతి॥

అని చెప్పబడుటచే గిరిప్రదక్షిణ మాదివారమున నాచరించుట ఫలప్రదముగ నెన్నబడుచున్నది.

శివస్వరూపులగు నాదిశంకరులు తమ శ్రీరామ కర్ణామృతమున భద్రగిరీశ్వరుని యథాస్వరూపముగ "వామాంక స్థిత జానకీపరిలసత్" అను శ్లోకముచే సన్నుతించుటం జేసి వారిచ్చటికి విజయంచేసిరని భావింపవచ్చును. ఈ శ్లోకమే నిత్య మిచ్చట ననుసంధింపబడుచున్నది.

శ్రీ త్యాగరాజస్వామి తమకీర్తనలలో 'గిరిపై నెల కొన్న', 'ఎన్నగాను రామభజన', 'క్షీరసాగరశయనా' అను వాటిలో రామదాసుగారిని పేర్కొనిరి.

## పోకల దమ్మక్క

భద్రాచలమునకు సమీపమునగల భద్రిరెడ్డిపాలె మను పల్లెలో శబరికులసంజాతయై పోకలవంశము మున్నేడు దరములఁ బరిపూత మొనరించి, ధన్యయై యొక సాధ్వి దమ్మక్క యుదయించెను. పుట్టినది మొద లీమె రామనామ స్మరణ ధ్యాన పరాయణురాలు. తన ముదుసలి తనమున నెంత వేడినను రామదర్శనము గాకపోయె నను జింతచే గుంది వలవల యేడ్చి పరుండగా నొకనాటి రాత్రి స్వప్నమున స్వామి సాక్షాత్కరించి, తనకు గొద్దిదూరముననే నుంటి ననియు, తాళ్ళద్రుమోపాంతమున వెదకిన గనుకొనవచ్చు ననియు, తనదర్శనసేవనముల గొన్నాళ్ళు తనివి జెందవచ్చు ననియు, అచిరకాలములో తగినవ్యక్తి తన సహాయమునకు రాగలడనియు నానతిచ్చి యదృశ్యుడయ్యెను. దమ్మక్క యుదయముననే లేచి, యూరివారి కీ తీ రెఱుంగ జెప్పిన, సంభ్రమమున నందఱును గత్తులు, గొడ్డళ్లు మొదలగు పరికరములతో దాడిచెట్టు సమీపారణ్యము బయలొనరించిరి. అప్పుడే యవతరించిరో యన్నట్లు పరిశుద్ధములగు శ్రీ సీతారామ చంద్ర లక్ష్మణదేవుల శిలామూర్తులు దృగ్గోచరము లయ్యెను.

అందరు నతిభక్తి జాగిలి మ్రొక్కి పందిరి నిర్మించిరి. తదాది యా తాడిచెట్టున బహు పండ్లనే అనుదినము నైవేద్యము నొసగి దమ్మక్క యర్చించెను. ఒకనా డీ విషయమును సరిగా గుర్తెఱుంగని తన బాలికను నైవేద్యము పెట్టుమని చెప్పి దమ్మక్క గ్రామాంతర మేగెను. బాలకునకువలె జావగాచుకొని యా కూతురు దేవదేవుని త్రాగుమని కోరెను. ప్రభు వది యంటకుండుటం గాంచి శోకాతురయై యా బాలిక అమ్మ జరిపిన విధముగనే పరిశుభ్రముగ జేసికొని తెచ్చితినే! నా యపరాధ మేమని యేడ్చుచు కఠినశిలకు తన శిరస్సు మోదుకొన నారంభించెను. ఆమె మాధుర్యమునకు జాలింగొని శ్రీ సీతారాములా జావ నారగించిరి. రిక్తకడవలతో నింటికి వచ్చిన కుమార్తెను జూచి మాత యిదేమని ప్రశ్నింప, బాలయు సవిస్తరము నుడివెను. దమ్మక్క పులకాంకిత దేహయై కూతురును పున్నెముల పుట్టగా దీవించి, మరునాడు వెంబడించి, మాటునదాగి యంతయుం దిలకించెను. బాలికకువలె మాత కెన్నండును మఱల నట్టి దర్శనభాగ్యము లభింపలేదు. కొంత కాలము జరిగిన వెనుక నా పరగణా పరిపాలనమునకు క్రొత్తగావచ్చిన యధికారి 'పాలవంచ' యను పురమునకు విజయముచేసి యున్నాడనియు, రైతులనుండి శిస్తుబకాయీలు వసూలు చేయుటలోనే కాక, అనుదినము రామనామ సంకీర్తనములు, భక్తజనులకు సంతర్పణములు జరుపుటలో నిమగ్నుడై యుండునని విని, దమ్మక్క తనకు స్వప్నమున దేవదేవు డానతిచ్చిన

"తగినవ్యక్తి" యితడే యగునని నిశ్చయించి ప్రాకులాడుచు నటకేగి యాతని సందర్శించి, తన యుదంత మాద్యంతమును నెఱింగించెను. సావధానముగ విని, యామె నాదరించి వచ్చి శ్రీరామచంద్ర మహాప్రభువును, దనయిష్టదైవమును, తొలి సారిగా దర్శించి సంతుష్టుడైన యీ మహావ్యక్తియే మన గోపన్నగారు. కొలది కాలమునకే దమ్మక్క కైవల్యము నొందెను. ఆమె పేరున నిప్పటికిని శ్రీరామాలయ పూజాదికములలో నొక భాగము 'పోకలవారివంతు' అని వ్యవహరింపబడుచు కొంద ఱర్చకులచే ననుభవింపబడుచున్నది.

## కంచర్ల గోపన్న (రామదాసు)

గోపన్నగారి నెఱింగింప బూనుట చంద్రునిం జూప దీపంబెత్తుటయే యగును. యీవఖాంధ్ర దేశమున రామదాసు కీర్తనల విననివా రుండరు. దాశరథీశతకము ప్రతి బాల బాలికయు జదివింపబడుదురు. అందే 103 వ పద్యమున,—

ఉ. అల్లన లింగమంత్రిసుతు డత్రిజగోత్రజు డాదిశాఖి కం
చెర్లకులోద్భవుండనఁ బ్రసిద్ధుడనై భవదంకితంబుగా
నెల్లకవుల్ నుతింప రచియించితి గోపకవీంద్రుడన్ జగ
ద్వల్లభ! నీకు దాసుడను, దాశరథీ! కరుణాపయోనిధీ!

అని తెలుపుటచే నాత్రేయగోత్రమున కంచెర్లవంశో న్నతుండగు లింగనమంత్రి కుదయించిన ప్రథమశాఖ బ్రాహ్మణుడని విదితము. తల్లి పేరు కామాంబయగుట నన్య

గ్రంథము లెటెంగించెడిని. "పట్టితి భట్టరార్య" యను పద్యమున గోపన్న తన దేవగురుభక్తి, వైష్ణవ మతావలంబనము వెల్లడించినాడు. సామాన్యముగం బ్రభుత్వాధికారముల సంపాదించి, వ్యవహారస్థిరులగు బ్రాహ్మణులు "నియోగు" లనబడుచుండుటచే నీతని 'నియోగి' యనియు గొంద అనిరి. కాని రామదాసుగారి తదనంతరము తద్వంశీయులు



రా మ దా సు

గుంటూరు జిల్లా వినుకొండ ప్రాంతమున కేగి స్థిరపడి రని పెరుమాళ్ళపల్లి గ్రామమున గల రని యం దొక రిటకు వచ్చినప్పుడు స్వయముగ జెప్పియుండిరి. వారు ప్రథమ శాఖయుల మని చెప్పుటచే గోపన్నగారు వ్రాసిన ఆదిశాఖ యదియే యనుకొనవచును.

ఖమ్మంమెట్టు జిల్లాలో నేలకొండపల్లి యనబడు గ్రామమున గోపన్నగారు జన్మించిరి. అట నొకచో టిప్పుడు రామదాసుగారి గృహ మని జూపుదురు. తద్వంశీయు లెవరునూ లేరు. గోపన్నగారికి అక్కన్న మాదన్నగారలు మేనమామలు. గోలకొండరాజ్యమును 17 వ శతాబ్దములో పాలించిన "అబుల్ హాసను షా" యను నవాబు "తానీషా" యను



తానీషా

నామాంతరమున విఖ్యాతుఁడై, తన వద్ద మాదన్నగారిని ప్రధానమంత్రిగను, అక్కన్నగారిని సేనాపతిగను నియమించెను. అక్కన్న మాదన్న లిరువు రత్యధిక మేధోనిధులు, వ్యవహార నిపుణులు, వాక్యచతురులు, ధైర్యసాహసములలో నప్రతిహత వీరులు. ఇరువు రైక్యకంఠముగ గోలకొండ రాజ్యమును తానీషాచే నిరుపద్రవముగ బాలింపజేసిరి.

ఆకాలమున జిల్లాలు, తాలూకాలు నేర్పడలేదు. రాజ్యమెల్ల గొన్ని సర్కారులుగను, సర్కారులు పరగణాలుగను, పరగణాలు పట్టీలుగను, విభజింపబడి యొక్కొక్క ప్రాంత మొక్కొక్కరి యధీనమం దుంచబడెను. ఖమ్మంమెట్టు సర్కారులోని "హసనాబాదు" పరగణాకు గోపన్నగారు బాధ్యతగల యుద్యోగిగ నియమింపబడెను. ఈ పరగణాయే పాలవంచ యను పేరున తరువాత ప్రఖ్యాతం బగుటం బట్టి, యిందు భద్రాచలప్రాంతముగూడ చేరి యుండుటం జేసి, లోకమున రామదాసు పాలవంచ తహశీల్దారని, భద్రాచలము తహశీల్దా రనియు జెప్పసాగిరి. 1883 సం॥న వెలువడిన కృష్ణా డిస్ట్రిక్టు మాన్యుయల్‌లో కృష్ణాజిల్లా చరిత్రకారుడగు నాంగ్లేయుడు, గోపన్నగారు మాదన్నగారి మేనల్లుడనియు, ఖమ్మంమెట్టు పేష్కా రనియు వ్రాసెను. ఎట్లయినను భద్రాచలప్రాంతమునకు ప్రధానాధికారిగా గోపన్న విచ్చేసెననుట నిర్వివాదాంశము.

దమ్మక్క పిలుపు నందుకొని గోపన్న భద్రాచలమునకు విచ్చేసి, శ్రీరామచంద్రప్రభు దర్శనమున ధన్యుడై యమ్మహనీయ మంజుల మంగళమూర్తిని విడువజాలక తన పాలవంచ మకామును మార్చి భద్రాచలముననే నిలువ సంకల్పించెను. పరగణా వ్యవహారము లెల్ల జక్కదిద్దుచు, నంతవఱ కెవ్వరును తమ్ముడుగక బకాయీలు పెట్టిన రైతులవద్దనుండి శిస్తులు సామరస్యముగ వసూలు పఱచుచు, సకలలోకాధీశ్వరుండగు రామప్రభు మాహాత్మ్య మెల్లఱకుం దెలుపుచు, దేవ

దేవునకు నిత్యసేవ లొనరించుచు, నిరతాన్నదానమున బ్రజల సంతుష్టులం జేయుచు, "శ్రీరామ నామం మరువాం మరువాం, సిద్ధమూ యమునికి వెఱువాం వెఱువాం" మొదలగు సంకీర్తనములచే భక్తిప్రబోధము గావించి పరమధార్మికజీవనము గడుపుచుండెను.

ఇట్లుండ నొకనాడు భాగవతోత్తములు బంతులుదీరి పాడుచుండ ప్రమాదవశమున తన యేకైక కుమారుడు వేడి గంజిగుంటలో బడి యాసన్నమరణు డగుట తల్లియగు కమలాంబ కనుగొనెను. నిస్సహాయయై యేమియుం జేయ జాలక భోజనకార్యమున కడ్డగులునని దుఃఖ మెల్ల మ్రింగి భర్తతో జెప్పక మిన్నకుండెను. అతిథిసంతర్పణానంతరము కృతకృత్యుడై యున్న గోపన్న కీ దుస్సంఘటన నెఱింగించి దుఃఖించెను. భాగవతశిఖామణి యగు గోపన్నకు మిన్ను విఱిగి మీద బడినట్లయ్యె, ఖిన్నత నేమియుం దోపనీక కంఠగత ప్రాణుడగు పాపను దన భుజమ్ములం దిడికొని రామసాన్నిధ్యమునకు దెచ్చి పడవైచి, "దేవా! పుత్రశోక మత్యంతదుస్సహ మగుట నీ వెఱుంగనిది కాదు కదా? దశరథు నంతవానికి నీ యెడబాటే కదా మరణకారణ మయ్యెను. మున్ను సాకేతమున విప్రకుమారుని బ్రతికించి తలిదండ్రుల నానందింప జేయువఱకు నిదురయైన బోయితివో? ఇంత కరుణామయున కీ దాసునిపై నేల యనుగ్రహము కలుగకున్నది?" యని పలు విధముల బ్రార్థించి "కోదండరామ కోదండరామ" యను

కీర్తనలో "ఏ బుద్ధి వీడు నెఱుగనివాడు, పాపము వీడు బడలి యున్నాడు, పాపను లేపి, బాధలు మాన్పి, యాపద బాపి, యటు ప్రీతి జూపి," యనియును, "నిమ్మిసచిన్నవా డెందరున్న, మమ్మేలగన్న మాయన్న, యన్న రావయ్యా—వీని రక్షింతు గాని, సేవ జేసెద నీదు సుతుడగుదు గాని" యనియును వాపోయి సతీపతులు మూర్ఛితులైరి. స్వామి కటాక్షించెను. నిదురించు బాలుడు మేల్కొన్నట్లు పుత్రుడు పునర్జీవితు డయ్యెను.

గోపన్న యానందాశ్రువులు రాల్చుచు, తన యిల వేల్పగు శ్రీరఘురాముని కృపచే చిన్నబాలుడు 'రఘు రాముడు' జీవించుట మహాభాగ్య మని భావించి నాటినుండి ప్రభువున కెట్టికైంకర్యము జేయబోలుదునా యని యోజింప సాగెను. 'రామునికి దగు నాలయము లేదు. వస్త్రవాహనములు లేవు. అలంకారములు లేవు. మహాభోగోత్సవములు లేవు. వేయేల, అచట నచట చిన్నదేవళములకు గల వృత్తులు గూడ నిచట లేవు. మహాదండకారణ్యమున భయంకర మృగములు దిరుగు నిచ్చోట, నాగరికత బొత్తుగా ప్రబలని యీ ప్రదేశమున నేనొకడను, రిక్తహస్తుడను, నావల్ల నేమి కాగల' దని విచారించెను. సాధనమార్గము లాలోచింపదొడగెను. తన కొక యధికారబలమే కలదు. రామానుగ్రహ మూతగా గొని, దాని వెచ్చించి సాధింప దలపోసెను. గ్రామీణులను భక్తజనులను పలువురను సమావేశపరచి, తన వృత్తాంతము విని విస్మితులైన వారితో నాలయ నిర్మాణాది ప్రశంసల

జర్పింప, వారును మృదుమధుర స్వభావుం డగు నతని యీ దేశమునకు మారు జెప్పనోల్లక తమతమ యంగీకార ములం దెల్పి ధనసహాయ మొనరింతుమని ప్రోత్సాహపరచిరి. తన కార్యమంతయు నెరవేఱినట్లుగనే భావించి, వారి బాసల నమ్మి, గోపన్న ఆలయ మంటప ప్రాకార నిర్మాణప్రారంభ డయ్యెను. తొలుదొల్తనే ధనాభావము పొడసూపినందున గాలక్రమమున ప్రభుత్వము వారొత్తడిసేయువరకు సరిపెట్టలేక పోవుదునా యని యీ మహానుభావుడు సర్కారు పైకముపై జేయి వైచెను. అనేక విధములగు భోగవిలాస వ్యయము లంగీకరించు తానీషాప్రభువు ధర్మమతి యగుటచే తనకు శాశ్వతకీర్తికరం బగు నిక్కార్యమున కంగీకరింపడా యనియు, యంతకు మించి దనయేలిక శ్రీరాముడు లేడా యనియు విచారించి, యతి త్వరితముగ బొక్కసములోగల రొక్క మంతయు వెచ్చించి శ్రీసీతారామచంద్ర మహాప్రభువు వారి యాలయ నిర్మాణ మొనరించెను. "ఎంతో మహానుభావుడవు"; "నీవు ఎంతో చక్కని దేవుడవు" అను కీర్తనలలోను "తక్కువేమి మనకూ రాముం డొక్క డుండువరకు" అను దానిలోను దన మనోనిశ్చయము వ్యక్తీకరించుచు, దశావ తారాది వర్ణనలచే రాముని యందు దన విశ్వాసమును వెలి బుచ్చెను. ఈ ఆలయ నిర్మాణమున రాముని కొక గట్టి కట్ట డమే నిలుపదలచెను. గాని గోపన్న కీర్తిప్రతిష్టల నాసించి అనవసర శిల్ప వ్యయాదులకు వశుడు కాలేదనుట దర్శించిన

వారికి స్పష్టమగును. భక్తులనెల్ల బ్రోత్సహించి అన్నపానాదులచే సంతృప్తి పరచి కార్యసాధకు డగుచు, వేయబడిన ప్రతిరాయియు రామనామము ప్రతిధ్వనింప భక్తిప్రేరితుడై శ్రామికు లొనరించిన ఆలయనిర్మాణమే మనము కనుగొందుము. కాని శిల్పాచార్యకళావైశిష్ట్యము నిం దెందును గానరాదు. ఈ యరణ్య మెల్ల బాగుచేయించి, గుట్టమిట్టల జదును చేయించి, వాస్తుశాస్త్రానుసరణముగ వాసయోగ్యముగ పురగోపురాలయనిర్మాణములఁ జేయించెను. తగుమాత్రముగ గరుడ హనుమంత శేష వాహనములు, ముఖ కల్యాణాధ్యయన మంటపములు, రెండు గోపుర ప్రాకారములు నిర్మించెను. చింతాకుపతకము, పచ్చల పతకము, కలికితురాయి, బిళ్ళల మొలత్రాడు, గజ్జెలందెలు, రవ్వల కుండలములుగల నీలాల చెవిపోగులు, నీలాల ముత్యాల చెవిపోగులు, చిన్న కిరీటములు, గొలుసు, మంగళసూత్రములు, కొప్పుజడ లాదిగాగల కొన్ని యాభరణములు జేయించెను. దీనికై ప్రభుత్వ ద్రవ్యము వ్యయమయ్యెను. అప్పటికి పరిస్థితులు గమనించి యిక ద్రవ్యసేకరణ జరుగజాలదని తోచి "ఏ తీరున నను దయచూచెదవో యినవంశోత్తమ రామా" యని సర్వము రాముని యధీనమని విన్నవించుకొనెను.

గోపన్నగారు జేయదలచిన దంతయు జేసిరి. నిత్యోత్సవ మాసోత్సవా ద్యనేకోత్సవములు, త్రికాలభోగములు, చక్రవర్తి లాంఛనములతో గల్యాణరథోత్సవము మొదలగు

వైభవములు భద్రాచలమున లోకానందదాయకముగ జరుగుచు కలియుగవైకుంఠ మను పేరు బడసెను. కాని కాలపరిస్థితులు తారుమారయ్యెను. తానీషా కొలువున నక్కన్న, మాదన్నలకు వ్యతిరేక ప్రచారములు పొడసూపెను. మొగలు చక్రవర్తియగు ఔరంగజేబు గోలుకొండను కబళింప మాటి మాటికి నుద్యుక్తుడగుచుండెను. హిందూమహమ్మదీయుల సఖ్యత భేదింప దన యనుచరులతో ప్రయత్నములు సాగించెను. అక్కన్నమాదన్నలు విజయవాడకు వచ్చి కనకదుర్గాలయ సమీపమున ధర్మసత్రములు గట్టించి బీదల కన్నదానము లొనర్చుచు మొగలుల వారినుండి తప్పించుటకు తానీషాను కొండపల్లి మర్గమున జేర్చుటకు ప్రయత్నించిరి. కాని యంతకుముందే గోలకొండలో జీలికలు బయలుదేరెను. మహమ్మదీయులు హిందువుల ద్వేషింపసాగిరి. ఇట్టికల్లోలపు సుడిగుండములో గోపన్నగారు చిక్కవలసి వచ్చెను. ప్రభుత్వపు గూఢచారులు రామదాసుగారి యెడ విమ్రప్రచార మొనరించి ఆలయనిర్మాణ మొకసాకుగా తానీషాను కంటగింపజేసి గోపన్నను బందీగా గొనితెచ్చుట కాజ్ఞాపత్రికను బంపునట్లు జేసిరి. అంతియేగాక కొందరనుచరులు దౌష్ట్యమునకు వెనుదీయక ఖజానా దోపిడీచేయుటయు, బాకీదారులచే శిస్తు లెగవేయించుటయు జరిపిరి. తానీషా యాజ్ఞాపత్రిక గోపన్నకు జేరువరకు నిట్టి సకలోపద్రవములచే సంభవించిన ఖజానాలోటు ఆరులక్ష లుండి గోపన్న దానికి బాధ్యుడుగా

పరిగణింపబడెను. ఈ ఆలయనిర్మాణము ఆచంద్రార్కము దనకీర్తి వెలయింప గావింప బడెననియు, హుజూరువారు యేటా చేయు యధిక వ్యయములో యిది యల్పముగ బరిగణింపబడ దగినదనియు, విశేషఫల మొసంగునదియనియు, దీని కంగీకరింపవలసినదనియు తొలుతనే గోపన్న దాఖలుచేసికొనిన విన్నప మనాదరింపబడెను. రాజభటులు గోపన్నను బందీగాగొనిపోయిరి. పరగణా ప్రభు లెల్లరు మిక్కిలి యాక్రందించి, వెంటనంటి కొంతద వ్వేగి, తమ ప్రాణతుల్యుడగు గోపన్నగారికి రాజదర్బారులోను పట్టణములోను కొందఱి సహాయసంపత్తితో నీఋణ మీగవలయునని సలహాల నొసంగి క్రమ్మరిల్లిరి. కాని గోపన్నగారు కేవలమానవుల యాచించునో! బందియై వెళ్ళుచూ "నీ సంకల్పం బెటువంటిదో గన నెంతవాడ రామ" యను కీర్తనలో, "తోచి తోచకను తొడరి కరంబుల జాచి పరుల నే యాచన సేయను" అని తన మనోనిశ్చయము వెల్లడించెను.

కారాగారమున బంధింపబడి "అన్యథా శరణం నాస్తి"యను శరణాగతి జేయుచు "పరమపురుష యే వెరవు లేక నీ మరుగు జొచ్చితిని యటుమటు జేయకు" "పాలముంచు నను నీళ్ళముంచు నీపాల బడితి నిక" యనియు "గరుడగమన రారా" యను కీర్తనలో ముందే విన్నవించు కొనెను. రాముడు వెంటనే స్వప్నమున దర్శన మొసంగి దమ్మక్కకు జెప్పినట్టే తనకును పరిష్కార మార్గము నూచింపడా యని

పాప మనీ గోపన్నయు భావించెను. గాని భక్తులను శాణమున బరీక్షించు జాణ శ్రీరాముడని యెరుంగడయ్యె. కనుకనే "ఏమిరా రామా" యను కీర్తనలో తన నేరము లున్న బయటబెట్టు మని సవాలుజేసెను. అంతేగాక, 'రక్షింప విది యేమో'యను కీర్తనలో తనకు రాముడుదప్ప మఱొక రక్షకు లెవరనియు, 'కర్తవ్యం మహదాశ్రయ'మ్మను నీతిననుసరించి "అధికునిచే పడితి" ననియు 'భయము బాపి బ్రోవు' మనియు పాడుకొనెను. అందుకు గరుణ రాకున్న స్వామిని క్షమాభిక్ష వేడుకొనుచు, 'నా తప్పు లన్ని క్షమించుమీ'యను కీర్తనలో కాయ తీగకు యెగ్గు గాదనియు, కడుపున బుట్టిన తనయుడు ఎంతో దుడుకుతనము జేసేటప్పుడు, కొడుకా రమ్మని చేకొను గాని నూతిలో పడద్రోయునో' యనియు దేవదేవుని డెంద ములోని లోతులు పరీక్షించు నంతటి దైన్యముం గనబఱ చెను. రోజులు గడచుటయు, పాదుషా పరుషవాక్యము లాడు టయు జరుగుచుండెనే కాని బాకీ పరిష్కారమార్గము గోచ రింపదు. కలడో లేడో యని గజేంద్రు డాలపించినట్లు గోపన్నయు "ఏడ నున్నాడో"యను కీర్తనలో శ్రియఃపతిని వెదుకసాగెను; పరితపించెను.

దీక్షవహించి నాకొలది దీనుల నెందఱ గాచితో జగ
ద్రక్షక, మున్ను నా ద్రుపదరాజతనూజ తలంచినంతలో
యక్షయమైన వల్వ లిడి తక్కట! నా మొఱ లాలకించి ప్ర
త్యక్షము గావ దేమిటికి దాశరథీ! కరుణాపయోనిధీ!

యని మరిమరి వేడుకొనెను.

అప్పటికిని బాకీ పరిష్కారము కానందున రాజాజ్ఞ కఠినతర మయ్యెను. బందిఖానాలో గోపన్నను వీపు వాయ గొట్ట నారంభించిరి. "ఎటుబోతివో రామా యెటుబోతివో" యను కీర్తనలో రాముని వెదుకుకొనుచు, 'అంధకారము వంటి బందికానాలో నన్ను నింకల నెడ బాపవేల' యనియు 'తానీషాగారు వచ్చి తరితీర్పు చేసెనట, పైకము పంపించి వేగ బందిఖానా వదిలించ కెటుబోతివో' యనియు 'అప్పుల వారు వచ్చి అరికట్టుచున్నారు, ఒప్పనోపను నని చెప్పక దాగినావో' యనియు విలపించెను. బాధలకు తాళజాలక "అబ్బబ్బ దెబ్బలకు తాళలేర" యను కీర్తనచే వగహాలు, మొహోరీలు నీ పరిచారకులకు బంచి పెట్టితినిగాని, "పరుల కొక రువ్వ యియ్యలేదు గదర" యనెను. దీనినిబట్టి యాలయ నిర్మాణాదు లెంత పొదుపుగ సాగించినది తెల్లమగుచున్నది. "రక్షించే దొరవని నమ్మితి" యను కీర్తనలో శ్రీవల్లభునిపై తన సంపూర్ణ విశ్వాసమును విదిత మొనర్చెను. "నన్ను శిక్షింప దప్పేమి జేసితి"నని ఖండితముగా నడిగెను. "రామా నీ దయ రాదుగా" యను దానిలో, నిన్ను నే వరములు భాగ్యము లడుగుటలేదని, "ఆకొన్నవాడనై యనవలసి యుంటినిగాని, నీకే దయరాకున్న నేమిసేయువాడ" ననియు దైన్యమున స్తుతించెను. రాజభటు లంతతో నాగక ఇనుప సీళ్ళతో బిగించి కొట్ట మొదలిడిరి. "అబ్బబ్బ దెబ్బలకు నోర్వలేర"యను కీర్తనలో "అట్టి నిను బూజించినట్టి చేతుల

నిదిగో కిట్టి కట్టి కొట్టే రెట్లు తాళుదునయ్యా" యని మిక్కిలి వాపోయెను. "శరధి బంధించిన శౌర్య మేమాయెరా" యని హెచ్చరించెను. "ఇన్నిగలిగి మీరా రూరకున్న నే నెవరివాడ నౌదు" నను కీర్తనలో రాముకు కరుణించి తన్ను రక్షింప వలె నన్న నెన్ని సాధనసంపత్తులు కలవో వివరించుచు, శ్రీ మహాలక్ష్మి, కామధేనువు, కల్పతరువు, చింతామణి పరుసవేదుల నేకరువు పెట్టెను.

అతిక్రూరమగు రాజదండనము ననుభవించుచు, నెంత యార్తదశలో నున్నను రామనామసంకీర్తనము గోపన్న మానలేదు. అతిక్లేశములగు తన యనుభవములను స్వామిని సన్నుతించుటలోనే సంపుటీకరణ మొనర్చి యట్టి సాహిత్యముచే నప్పటి పరిస్థితులను నేటికిని మన మూహింపగలుగు మహోపకార మొనర్చెను. దాశరథీశతకమువలె రామదాసు కీర్తనలలోను స్వవిషయము నుద్ఘాటింపకున్నచో నింతమాత్రము చరిత్రాంశముకూడ జీకటిలో వెదకికొనవలసి వచ్చెడిది. పాపము సామాన్యఖైదీలతో బాటు దుష్టమతులు గోపన్న గారిచే నుదయమున బావివద్ద పనిచేయించిరి కాబోలు, "మేలైన చిటికెనవ్రేలు ప్రాతఃకాలమందున గుట్టె తేలు" యను కీర్తనలో తేలుబాధ బహు పాపిష్టిది. దానిని భరింప జాలకున్నాను. రక్షణకు రమ్మని రాముని బిలిచెను.

మాసములు సంవత్సరములు క్రమించుచున్నవి గాని దిన మొక గండముగా గోపన్న గడుపుచుండెను. విసువు

జనించి "పాహి మాం శ్రీ రామా యంటే పలుకవైతివి" యను కీర్తనలో శ్రీరాముని శరణాగతత్రాణ బిరుదమును సూటిగా ప్రశ్నించెను. "చరణములే నమ్మితి" యను దాన శరణాగతిని మరిమరి ధృవీకరించెను. కాని తన బాధోపశమనమునకు దారి తెన్ను గానక "సీతారామస్వామీ, నే జేసిన నేరము లేమీ" యను కీర్తనలో రాముడు గన్పించినయెడల నొడలి యాభరణములెల్ల నూడబెఱికికొని తన బాకీకి వినియోగించుకొనునేమో యని శంకించి దాగియున్నా డను కొని, నేను తమ దర్శన పాదసేవల గోరుదునే కాని నీ విభూషణముల జోలి నాకేల ననెను. "పలుకే బంగారమాయెనా" యని దీనముగ బ్రతిమాలెను. తన ప్రభువు కరుణింపక ఏల జారవిడుచుచున్నాడో రామదాసున కర్థము కాలేదు. తన బాకీ యన్యాయమని భావించి యుండవచ్చుననియు, దాని లెక్క గూడ విన్నవించుట తన ధర్మమనియు దలచి, "ఇక్ష్వాకు కులతిలక ఇకనైన బలుకవు రామచంద్రా" యను సుప్రసిద్ధ కీర్తనలో జాబితా నొకదానిని రామునిముందుబెట్టి ప్రాకార మంటప వస్తువాహనాద్యలంకారములకు తా నెట్లు వెచ్చించినది, రాము డెట్లు బాకీ పడినది రూఢిపరచి, "ఏటికి జల్లిన నీళ్ళాయె నా బ్రతుకు, రామచంద్రా, నేను అధమునాలి కంటె నన్యాయమైతి" నని విలపించెను. తన యలంకారములలో తన మామగారుగాని, తండ్రిగారుగాని పెట్టిన దేదియు లేదని అప్పులవాం డ్రాయాసపెట్టు దుడుకుపదము లన్నియు

ప్రయోగించి మందలించెను. తన కీ పరుష వాక్యములన్నియు దెబ్బల బాధవల్ల వెలువడినవే కాని యిందు తప్పు గొనవల దని ప్రార్థించెను. ప్రతి యాంధ్రుని డెందమును భక్తిపరీత మొనరించి, కరుణబీజమును నాటు నీ చక్కని కీర్తన మిక్కిలి కీర్తింపబడుచున్నది.

అప్పటికిని కరుణ గలుగకున్న రామదాసున కింక చిరాకు జనించెను. అప్పులు వసూలు చేయువాని కడసారి పద్ధతి నవలంబించెను. "నిన్ను బోనిచ్చెదనా, సీతారామ! నిన్ను బోనిచ్చెదనా" యను కీర్తనలో "దిక్కు గలిగితే మొరబెట్టుకోర"యనియు, "తడయక నీ తలిదండ్రు లొచ్చిన గాని, విడిచిపెట్టని నీ కొడుకునురా"యనియు "రవ్వసేయుదు" ననియు బెదరించెను. అట నాగక, "అడుగుదాటి కదల నివ్వను" అనుకీర్తనలో "నీకు కోపమొచ్చిన భయపడను" అనియు, "రేపు మాపని జరిపిన నే నాప"ననియు, "సాక్షిబెట్టి ఒక దీక్షచే నిన్ను సాధింతు"ననియు హెచ్చరించెను. ఇప్పటికి గూడ మారుపలకకున్న స్వామిని సాధించుటకు మఱొక మార్గమును గోపన్న కనుగొనెను.

"రవి గాననిచో కవి గాంచునేకదా!" అది యేమన నమ్మ నాశ్రయించుటయే. "రామ నీ చే తేమి గాదుగా"యని తుదిసారిగా తన యగచాట్లు సీతాభామకు జెప్పవలసినదని స్వామినే కోరెను. ఫలవంతము కానప్పుడు తానే స్వయముగ విన్నవింపదలచి "రామచంద్రులు నాతో చలము జేసినారు,

సీతమ్మ చెప్పవమ్మ" యని ప్రారంభించెను. రాముని కాఠిన్య మును నిరూపించెను. సీతమ్మనైనను ఒకానొక యనుకూల సమయమున తన దుర్గతిని వినిపించి కార్యసాఫల్య మగునట్లు ప్రేమమాట లాడవలె నని "నను బ్రోవమని చెప్పవే"యను కీర్తనలో నుపాయమును సూచించెను. "జనకతనయ నాదు మనవి గైకొని జగజ్జనకునితో దెల్పవే" యను దాన తన బాధలు తేటతెల్ల మొనరించెను. "పన్నెండేండ్లనుండి పగలు రేయి నాపన్నుడ"నైతి నని "కన్నీరు లేకుండ నున్నతీరు నా కెన్నడును లేదుగదా" యని "ఇడుములఁ బడలేను నుర్విపై ప్రాణములు విడిచి మిమ్ము జేరెద" ననియు సవిస్తరదీనాలాప ములతో బాటు, "అతిభీతి నొంది నే నార్జించితిని విమమాలస్య మిక జేయకు" మనియు, చేతికి మించిపోయిన పని జరుగగల దను రహస్యముం దెల్పెను. చివరి కీ యుపాయ మనపాయమై మాతృకటాక్షలాభ మంది గోపన్న కృతకృత్యు డయ్యెను. లలితవాగ్విశారద యగు జానకిచే ప్రేరేపింపబడి శ్రీరామ చంద్రమూర్తి లక్ష్మణద్వితీయుఁడై గోపన్న యాపదల బాప సంకల్పించెను. గోపన్న ఘోర కారాగార గహనావాస మున మిక్కుటమగు నార్తిం గుంది తన జీవితము నారేయి చరమాధ్యాయము నొందింప కృతనిశ్చయుఁ డయ్యెను. అందు తన తప్పేమి లేదనుటకు గడపటిసారిగా "ముచ్చటైన నాడవేమిరా" యను కీర్తనలో "చిక్కి కాయ దినన్న కొంకి నక్కవలె చిక్కారించుకొని ఒక్కడనే" యుంటిగదా యని,

పం(డెండు వర్షములనుండి చీమలు, నల్లులు, దోమలవలన బాధలు దుర్భరములాయె నని విలపించెను. ఇప్పటికి దాసుడు బరీక్షలో కృతకృత్యుడైనాడు. రాముని శరణాగతధర్మము కార్యరూపము దాల్చినది. నిశీథసమయమున నిదురించుచున్న తానీషాకడకు రామదాసుగారి జవానుల రూపముల ధరించి రామలక్ష్మణు లేగి నవాబుముందు రామరాజ్యమునాటి బంగారు నాణెము లొలకబోసిరి. మాయామనుష్యు లంతర్ధానమయిరి. స్వప్నముగ భావించిన తానీషా యుదయమున నా ద్రవ్యమునుగాంచి నిర్విణ్ణుం డయ్యెను. క్రమముగా లెక్కింపబడిన యా ధనము రామదాసుగారిపై తేల్చబడిన బాకీ మొత్తమునకు నిక్కచ్చిగా సరిపోయెను, అని కృష్ణాజిల్లా చరిత్రకారుడు వ్రాసియున్నాడు. చీకటికొట్టులో నున్న దాసునుం జూచి వెళ్లుదమని రామలక్ష్మణులువిచ్చేసి ద్వారము నుండి కాంచిరి. రామదా సప్పుడు తన మనఃపద్మమున లోక కల్యాణకరుని ధ్యానించుచు "ఏమయ్య రామ బ్రహ్మేంద్రాదు లకునైన నీమాయ దెలియవశమా" యని సంకీర్తన మొనర్చుచుండెను. లక్ష్మణుని లోనికంపి గిన్నెలోని విషమును మన్నున గలిపించెను. ఆ మరునా డరుణోదయమున ఖిన్నమనస్కుడై తానీషా యేతెంచి రయమున రామదాసుగారి బాకీకి వ్రాయంబడిన రసీదు సమర్పించి పరిపరివిధముల వేడికొనెను. "తప్పులెన్నబోకు, ఇక మీ యప్పు దీరె మాకు, కుప్పబోసిన ధన మప్పగింపకయే రెప్పపాటుననె జెప్పక పోయిరి" యని

పరిశపించెను. తనకు తానీషాకు నట జరిగిన సంభాషణమును "ధన్యుడవు తానీషా నీవు నన్ను గన్నయ్య పదములు కనుల గన్నావు" యను కీర్తనలో రామదాసు పొందుపఱచెను. అందు, "భద్రాచలము నెప్పటికి మీ రామభద్రున కిచ్చితిమి బాగుగ వినుము, ముద్రనిశానీలు చేకొనుమి, శ్రీభద్రాద్రి వర రామదాసుడై మనుమి" యని తానీషా వ్రాసిచ్చినట్లు వివరింపబడి యున్నది.

చారిత్రకాంశము లికముందు చర్చింప బడనున్నను గోపన్న కావ్యకాలాదు లిట దెలుపుట ప్రస్తుతమైయుండును. అప్రతిమప్రతిమానుభావులగు మహానుభావు లక్కన్న మాదన్నలకు మేనల్లుడైన గోపన్న వంశక్రమాగత విద్యావిశేష బుద్ధివైశారద్యముల గణనకెక్కుటలో సందియ మేమి? విశేషించి బాల్యముననే రామభక్తిపరుడై, రామానుగ్రహ పాత్రుడై, సుప్రసిద్ధాంధ్రకవియై, పూర్వపుణ్యవశమున * కబీరు ప్రత్యక్షమగుటయు రామనామ మంత్రోపాసన మనుగ్రహింపబడుటయు దెలుపబడుచున్నది. తొలుత మనకు గన్పట్టుచున్నది, గోపన్నగారి దాశరథీశతకము. అందు,

* కబీరు రామదాసుగారికంటె చాల పూర్వుడు. అయినను నిది యసాధ్యము కాదు. తపోజ్ఞానధను లెప్పుడు చిరంజీవులై పనిబడిన వేళల గన్పింతురు. రామాయణము నాటి మహర్షులు భారతోద్యోగపర్వమున ప్రత్యక్షమైరికదా!

ముసగొని రేగుబండ్లకును మౌక్తికముల్ వెలవోసినట్లు, దు
ర్వ్యసనము జెంది కావ్యము దురాత్ముల కిచ్చి మోసమయ్యె, నా
రసనకుఁ బూతవృత్తి సుకరంబుగఁ జేకురునట్లు వాక్సుధా
రసములు చిల్కఁ బద్యముఖరంగమునందు నటింపవయ్య, సం
తసమును జెంది భద్రగిరి దాశరథీ! కరుణాపయోనిధీ!

యని కృత్యాదినే ప్రస్తావించెను. కాన గోపన్నగారు రామదర్శనమునకు బూర్వమే యే కావ్యమో వ్రాసి, మానవుల కిచ్చి తరువాత తప్పు జేసితి ననుకొనిరి. కావ్య ముపలబ్ధము కాదు. కృతిభర్త యెవరో యెఱుంగజాలము. కాని ప్రౌఢకవి యైనపిదపనే భద్రగిరికి వచ్చెనని విశద మగుచున్నది.

కంటి నదీతటంబు, బొడగంటిని భద్రనగాధివాసముం,
గంటి నిలాతనూజ, నురుకార్ముక మార్గణ శంఖచక్రముల్,
గంటిని మిమ్ము లక్ష్మణుని గంటి కృతార్థుడ నైతి నో, జగ
త్కంటక దైత్య నిర్దళన! దాశరథీ! కరుణాపయోనిధీ!

యని భద్రగిరిరాము సవిమర్శముగ నుతించిన పద్యము కూడ గ్రంథాది నుండుటచే రామదాసుగా రిటకు రాగానే శతకరచనకుఁ గడంగిరి. రామ సందర్శన పరవశుడగు కవి యూరకుండ నేర్చునా! ఆలయ శతక నిర్మాణములు వెంట వెంట జరిగినవే. శతకము ప్రౌఢకవికి గోష్పదమువంటి దగుట త్వరలో బూర్తియయ్యెను. కాంచీనగర ప్రాంతమునుండి యాయన బిలిపించిన వివిధగోత్రములవారగు నైదుకుటుంబ ముల వీరవైష్ణవుల నిట నిల్పి తొలునొల్త పూజల జరిపించెను.

"శ్రీరమ సీతగాగ" యను పద్యమున వీరవైష్ణవాచారజనంబు లున్నట్లు దెల్పబడెను. శతకము భావప్రౌఢమును ద్రాక్షాపాక మును నగుటంజేసి రామదాసు ప్రౌఢవయస్సున నీ యుద్యోగ మున బ్రతిష్ఠుడగుట యూహాదూరము కాదు.

రెండవ యుపలబ్ధమగు కావ్యము ఖైదుకీర్తనలు. గోపన్నగారి కీర్తనలు, చిగురున రామదాసాంకితములై యొప్పును. ప్రకటన మోసముల దోసము లెరుంగని యా పున్నెపు కాలమున మరొక ఱీ పేరున వ్రాసియుండరు. బాధ లనుభవింపుచు వ్రాసిన రసోల్బణ భంగిమమే యవి చాటక చాటుచున్నవి. ఇదియునుంగాక శతకములోని భావములు మాటలు గూడ నున్న వున్నట్లు కుప్పతెప్పలుగ కీర్తనలలో కలవు.

"పుడమిలోన నావంటి గురాత్ముడు పుట్ట డింక నంటి
విడువకుమయ్యా యని నున్నే విన్నవించుకొంటి" (కీర్తన)
విన్నపమాలకించు రఘువీర నహిప్రతి లోకమందు నా
కన్న దురాత్ముడుం బరమ కారుణికో త్తము వేల్పులందు నీ
కన్న మహాత్ముడుం బతితకల్మషదూరుడు లేడు నాకు వి
ద్వన్నుత నీవె దిక్కుగద! దాశరథీ! కరుణాపయోనిధీ! (శతకము)
'గట్టిగ యమునికి నామము బెట్టినాను' (కీర్తన)
'యమకింకరాళికిం గట్టితి బొమ్మ' (శతకము)

ఈ పద్యము శతకాంతమున నున్నది గాన కీర్తనల కన్న శతకము ముందని తెలిసికొనవచ్చును. ఇట్టి వెన్నెని కలవు. కీర్తనలన్నియు తన విషయము స్వాచిత్ర్యముగ

దెల్పుచు ప్రాయికముగ కీర్తించుట కనువుపడినవిగా రచించుటచే భజనకీర్తన లను ఖ్యాతి నొంది, భజనసమాజోపయుక్తము లగుచున్నవి. భక్తుల కింత మహోత్కృష్ట కావ్యముల నందించి మోక్షసాధకులగుటకు మార్గముం జూపి వినువారుగూడ దరింప ననువు గల్పించిన రామదాసుగా రాంధ్రుల కారాధ్యపురుషుడు. "స్వయం తీర్ణః పరాం స్తారయతి" యనుట కాదర్శప్రాయుడు.

'*Krishna District Manual*' కృష్ణాజిల్లా చరిత్రకారుడు, అబుల్లాకుతుబ్ షా 1669 లో మరణించెననియు అబుల్ హసన్ గోల్కొండ సింహాసన మధిష్టించెననియు తెలుపుచున్నాడు. కనుక గోపన్న క్రీ. శ. 1670 లో పరగణాధికారపదవి నొంది 1674 వరకు భద్రాచల శ్రీ సీతారామాలయ నిర్మాణము గావించి 1686 వరకు కారాగారబంధితుడై విముక్తినొంది కృతార్థుడై భద్రాచలమునకు తిరిగి వచ్చి కొంతకాల ముండె నని యేర్పడు చున్నది. ప్రౌఢవయస్సుననే యుద్యోగ మొదవె ననియు, తా నత్యంత దుఃఖితుడై కారాగారమున నున్నను, క్లిష్టతర రాజకీయసమస్య లడ్డువచ్చుటచే మేనమామలు ద్రవ్యసహాయము చేసి విడిపింపలేకపోయిరనియు, అది వారు ప్రభుత్వ ద్రవ్యదుర్వినియోగముగ భావించియున్నకుండిరనియు తానీషాకు బదులుచెప్ప నుద్యమింప లేదనియు నూహింప వలసినదే కాని ఖైదులో నన్యాయముగ మరణించినాడను అసహనపూర్వక మగు కొందఱి కల్పనలు దురూహ్యములు.

అట్టిదే జరిగిన మిగిలిన కొద్దికాలమైనను భద్రాచల రామాలయము నడుపబడుట, ఈ ధర్మాదాయమును వెనుకవారగు నైజాము వంశీయులు పరంపరగా సాగనిచ్చుట పొసగని విషయము లగును. ఇక ప్రకృతము తానీషాచే ననుజ్ఞాతుండై రామదాసు భద్రాచలమునకు మరలెను. వచ్చునపుడు రెండు నాణెములు మాత్రమే పూజాదికములకై వెంట దెచ్చుకొని శ్రీరామలక్ష్మణుల నలంకరించెను నేటికి నవి యట భాసించుచున్నవి. తక్కిన ద్రవ్యము తానీషా గొనిపొమ్మన్నను భక్తు డంగీకరింపలేదు. తన యిష్టదైవముం దర్శించి "బహుకాలమునకు శ్రీ భద్రాచలేశునకు పాదసేవకుడ నైతి" నని యెంతో ఆప్యాయముగ, గాన లహరిలో మూగెను.

తరువాత కొంతకాల మిద్దేవుని మహా ప్రభావముల గీర్తింపుచు, తానీషా యొసంగిన 'హాసనాబాదు' పరిగణా యనబడు నిప్పటి పాలవంచ భద్రాచల ప్రాంతముల బాలింపుచు, శ్రీ సీతారామచంద్ర మహాప్రభువువారి యనంత కల్యాణ భోగోత్సవములకు వెచ్చించి భద్రాచలమున కొక కలియుగవైకుంఠ మనదగిన ఖ్యాతి కూర్చెను.

అనతికాలమున రోగగ్రస్తుడై "ఎక్కడి కర్మము లడ్డుపడెనో ఏమి సేయుదు రామా" యని ప్రార్థించుచూ "మూడు నెలలాయె రామునిముందు నిలువక-ఎన్నడిట్లుండి నేను యెఱుగ రాఘవా!" యని తెల్పుకొనెను. బాధ కోర్వ

జాల ననెను. "అంతా రామమయం బీ జగమంతా రామ మయం" అని భక్తసమూహములందు బాడెను. ఉత్సవములకు ననేక కీర్తనలను సంధించెను. అంత్యకాలమున నెల్లఱు చూచుచుండగా దేవదేవుడంపిన దివ్యపుష్పకారూఢుండై రామదాసు శ్రీ రామసాయుజ్య మొందె నందురు.

## నవాబు తానీషా

శ్రీరామ దర్శనమాత్ర సఫలీకృతజన్ముడగు తానీషా పుట్టుపూర్వోత్తరములు వినవలయునను కుతూహలము పాఠకులకు కలుగకపోదు. గోలుకొండ రాజధానిగా దక్షిణభారత మెల్ల నకంటకముగ 175 సంవత్సరములు పాలించిన నవాబులు కుతుబ్ షా వంశమువారు. ఇంచుమించుగ నీ నవాబులెల్లరు ధార్మికబుద్ధి, సజ్జనాదరణ, కవి పండిత గౌరవాదరములు, మతసహనము, ప్రజానురక్తి, సహృదయత్వము కల వారుగనే కీర్తివడసిరి. క్రీ. శ. 1512లో ఖులీ కుతుబ్ షా గోలకొండ సింహాసన మధిష్ఠించెను. తరువాత 1543, 1550, 1580, 1611, మరియు 1669 సంవత్సరములలో క్రమముగా నొకరి వెనుక నొకరుగ తద్వంశీయులు 'జమ్షీద్' 'ఇబ్రహీం' 'మహమ్మద్ ఖులీ' 'అబ్దుల్లా హుస్సేన్' 'కుతుబ్ షాహాలు' మరియు 'అబుల్ హసన్ షా' సింహాసనముల నధిరోహించిరి. మూడవ వాడగు ఇబ్రహీం కుతుబ్ షా స్వయముగ నాంధ్ర కవుల పరామర్శించి పోషించెడివాడు. కవు లితని 'మల్కిభరా' మని వాకొనిరి. ఇది 'మలిక్' 'ఇబ్రహీం' అను రెండు పద

ముల కలయికచే ఉచ్చారణ సౌలభ్యముగ సమసింపబడిన పదము. ఇబ్రహీం అనురాజు అను నర్థము కలిగినదగుచున్నది. ఇతడు కృష్ణదేవరాయల వంశీయులచే బాల్యమున బోషింప బడెననియు, దత్సహాయమున రాజు కాగలిగెననియు, లేనిచో జ్ఞాతివధకు గురికాబడి యుండెడివాడనియు విమర్శకు లుదహ రించినారు. మల్కిభరామునకు "తపతీ సంవరణోపాఖ్యానము" అను కావ్యమును, శ్రీ గంగాధర కవివర్యుం డంకిత మొసంగి అతని కొలువుకూటమును మిగుల వర్ణించినాడు. అతని దండ నాయకుడగు అమీన్‌ఖానునకు దన అచ్చదెనుగు "యయాతి చరిత్రము"ను పొన్నగంటి తెలగన్న యంకిత మొనర్చెను. ఈ నవాబు విషయమై చాటుపద్యములుగూడ పెక్కుగలవు.

ఈయన తరువాతవాడగు కులీ కుతుబ్‌షా గోలకొండ సమీపమున తన యుంపుడుగత్తె పేర భాగ్యనగరముం గట్టించి తరువాత దన కుమారుని పేర హైదరాబాదుగా మార్చి రాజధాని సౌకర్యములు కలుగున ట్లభివృద్ధి నొందించెను.

అటువెనుక అబ్దుల్లా కుతుబ్‌షా చాలకాల మేలెను. కొండపల్లి దుర్గమున బాలా హిస్సర్ అనబడు నవసభాభవన మును, అందొక యందమగు సింహాసనమును మనోజ్ఞముగ నెలకొల్పజేసెనట.

చివరివాడగు అబుల్ హసను లేక తానీషా మిగుల బ్రాహ్మణభక్తి కలవా డనియు, హిందూమహమ్మదీయ కలహములు లేకుండ సుఖపరిపాలన మొనరించెననియు సుప్ర

సిద్ధ డయ్యెను. ఢిల్లీనుండి వచ్చి మొగలాయి యువరాజు ఔరంగజేబు, ఔరంగాబాదులో గట్టిగ గూరుచొని తన రాజ్యవిస్తరణాశ, హిందూమతద్వేషము, ధనాభిలాష, ముప్పేటలుగా పురిమెలుచుచు, నీ త్రాడెవరి కంఠమున దగిలింతునా యని నిరంతరజాగరూకుడై యుండెను. రెండు మూడు పర్యాయములు లా యురిత్రాడు తానీషాపై విసరెను. గాని అక్కన్న మాదన్నల యుద్ధతంత్ర నైపుణ్యమువలన తానే లొంగిపోవలసి పలాయితు డయ్యెను. కాని రగిల్చిన మతద్వేషాగ్ని యూరక పోలేదు. క్రమముగా వైమనస్యము లేర్పడి పెరిగి పెద్దవై తుదకొక తురుష్క సేనానాయకుడు (ఇబ్రహీం) గోలకొండకోట రహస్యముల నౌరంగజేబున కందిచ్చు నంతవఱకు పరిణమించి తుట్టతుదకు క్రీ॥ శ॥ 1687 సెప్టెంబరు నెలలో గోలకొండ యతని వశమయిపోయెను. తానీషా బందీగా గొనిపోబడెను. అక్కన్న మాదన్నలు హతులగుటయు జరిగిపోయెను. చక్రవర్తియగు ఔరంగజేబు గోలకొండ రాజ్యమును తనకప్పటికేయున్న 22 రాష్ట్రములలో చేర్చుకొని హైదరాబాదులో తన ప్రతినిధిగా "గాజియుద్దీన్" అను నతనిని తాత్కాలిక పరిపాలనాధికారమందుంచెను. ఔరంగజేబు 1707 లో గతించిన పిదప క్రీ. శ. 1724 లో మొగలు సర్దారులలో నొకడగు 'అసఫ్‌జా నిజా ముల్ ముల్కు' అనునతడు సర్వాధికారములతో దక్కను సుబేదారు (గవర్నరు)గా నియమింపబడి ఢిల్లీనుండి హైదరాబాదు

నకు వచ్చెను. ఈతడే క్రమముగ యుక్తియుక్తుడై మొగలా యీల క్షీణదశను ఆంగ్లేయుల యున్నతిని సమాలోచించి ఆంగ్లేయులకు సహాయుడై హైదరాబాదు రాజధానిగా నైజాము రాజ్యమును నెలకొల్పినవా డయ్యెను.

## పింగలి అక్కన్న మాదన్నలు

గోపన్నగారి మేనమామలును, తానీషా నవాబువద్ద మంత్రులును, సకల రాజ్యతంత్ర నయవిశారదులును, ధైర్య



అక్కన్న

సాహస సంపన్నులును, మహాత్యాగశీలురు నగు అక్కన్న మాదన్నల యుదంతము దెలిసినంతవర కెరుకపఱచవలసి

యున్నది. ఈ యుభయులలో అక్కన్నగారు పెద్దవారై మాదన్నగారిచే నన్నగారని పిలువబడుచుండెడివారని చరిత్రకారులు నుడివియున్నారు. గోపన్నగారు తఱచు అక్కన్నగారి మేనల్లుడని చెప్పబడుట కిదియే కారణము కావచ్చును.



మాదన్న

చెన్నపురి ఓరియంటల్ లైబ్రరీలోని (Local Records) స్థానిక చరిత్ర సంగ్రహమునం దక్కన్న మాదన్నల యింటి పేరు పింగళివారనియు, వారివంశీయులు పింగళి, సిద్ధలూరు వా రిప్పటికిని కలరనియు వ్రాయబడియున్నది. వరంగలు

ప్రాంతమున పింగళివారు విఖ్యాతులు. ఏనుగు లక్ష్మణకవి వ్రాసిన తుల్యామాహాత్మ్యమునందు "పింగళి మాదన్న భానుజీవలన సమ్మాన మొందె" ననియు "సుల్తా నబుల్ హసన్ క్షోణీశ్వరునిచేత మాటిమాటికి బహుమాన మందె" ననియు నుండుటచే అక్కన్న మాదన్నలు పింగళివారనియు అబుల్ హసన్ తానీషా యనియు తెలియుచున్నది. మాదన్నగారు మాత్రమే తానీషా కొలువున మంత్రిగా నుండినను, నీమంత్రి పుంగవు లిరువురికి సమాన గౌరవాదరములు చెల్లుచుండెడివి. కొంతకాలమునకు అనగా క్రీ. శ. 1682 సంవత్సరమున నంత వరకు తనకు సేనానిగానున్న మహామ్మదు ఇబ్రహీం అను వానిని తొలగించి తానీషా యతని శాహా లష్కరు (సేనాపతి) పదవిని అక్కన్న కిచ్చినారని ప్రభుత్వమువారు సేకరించిన Letter to Fort St. George అను రికార్డులలో గలదు.

ఈస్టిండియా కంపెనీ వారప్పట్టున చిన్నవర్తకులుగా ప్రవేశించి జార్జిటవున్‌లో స్థిరపడియుండిరి. తమ వర్తకము గోలకొండరాజ్యమున నిరాటంకముగ సాగించుకొనుటకై తానీషా యనుజ్ఞ నభిలషించుచు మంత్రిపుంగవులగు అక్కన్న మాదన్నల కెంతయో ఆదరబహుమానములు గనపఱచి ఎన్నో ప్రయత్నములు చేసినట్లు పై రికార్డులలో నుదహరింపబడి యున్నది. అప్పుడా ప్రాంత మెల్ల గోలకొండలోనిదే. 1678 లో తానీషా మాదన్న గారలు మచిలీపట్టణమున కేగ నచటి ఇంగ్లీషుకంపెనీవారు మిక్కిలి గౌరవించి బహుమతు

లోసంగినట్లును 1679 ఫిబ్రవరి నెలలో మైలాపూరు, ఎగ్మూరను స్థలములు కవులున కిప్పించవలెనని చెన్నపట్టణము ఇంగ్లీషువారు కోరుటయు, 1682 అక్టోబరు నెలలో అక్కన్నగారు మచిలీపట్టణమున కేగ వచ్చుటి కంపెనీవారు ఆయనను మిక్కిలి గౌరవించుటయు నందే కలవు. అంతకు ముందు కంపెనీవారి కొసంగబడిన యనుజ్ఞాపత్రిక ననుసరించి విశాఖపట్టణము మొదలగు స్థలములలో వర్తక విషయమైన సదుపాయములు కలుగజేయవలసినదని అక్కన్న మాదన్నగారలకు 1682 సెప్టెంబరులో విజ్ఞాపన మొనర్చి, అక్కన్నగారికిని, దుబాసి వెంకటాద్రిగారికిని ఆ నెల 25 తేదీని బహుమతులు పంపిరట. ఇంగ్లీషువారి వర్తకము ప్రోత్సహించి, ఫ్రాన్సు మొదలగు నన్యదేశస్థుల గోల్కొండ రాజ్యమునుండి తరిమివేసినచో నెన్నియో పుట్లు రాగియు, ధనము నొసంగుదుమని 14 ఆగష్టు 1683 సం॥ చెన్నపురిలో ఇంగ్లీషువారు తెలియజేసిరట. గోలకొండ రాజ్యమునం దెల్ల చలామణీ నిమిత్తమై మద్రాసులో ముద్రింపబడు రూపాయీలు, కానుల నుపయోగింప ననుజ్ఞ నొసంగుటకును, ఇంగ్లీషు వస్తువులు బందరునుంచే బయలుదేరుచున్నవి గనుక కర్ణాటకమున నేగుటకు శాయిరి సుంక మదనముగా వేయకుండ నుండుటకును ఏర్పాటు చేసికొనుటకు తానీషా బందరుకు వచ్చినప్పుడు విశేషధనము బహుమతిగ నొసంగవచ్చునని మదరాసు కంపెనీవారు మచిలీపట్టణమునకు వ్రాసిరట.

1682 నవంబరు నెలలో మాదన్నగారి సుతుడు మల్లప్పగారి వివాహ సందర్భమున ఖరీదు నొసంగబోయినను తీసికొనక పీరెను బంగారు గొలుసులు కానుకగ నొసంగిరట. ఆ సంవత్సరపు టుగాది కానుక నాల్గువందల వరహాలు మాదన్నగారికి బంపిరట. మాదన్నగారి కుమారుని ఉపనయనమునకు, పెండ్లికి, ఆయన పేష్కారునకు, బిడ్డకు, పినతండ్రికి బహుమతులు పంపి వారియనుగ్రహము బడయుటకు బహుధా ప్రయత్నించుట యందే వివరింపబడెను.

క్రీ. శ. 1680 లో పోడెల లింగప్ప యనువాడు చెన్నపట్టణమునకు వచ్చు సరకు సడ్డుపెట్టుచున్నందున కంపెనీవారుకోరగా అక్కన్న మాదన్నగార లట్లు జేయవద్దని లింగప్ప కాజ్ఞనొసంగి, అతనినే తమ ప్రతినిధిగ నియమించి ఇంగ్లీషులో నుత్తర ప్రత్యుత్తరములు జరుపుటకు నాజ్ఞనొసంగుటయు జరిగెనట. 1682 జూలై నెలలో మదరాసు గవర్నరుకు లింగప్ప లేఖవ్రాయుచు సంవత్సరపు పన్ను 2000 వరహాలీయవలసినదనియు, అక్కన్నగారి మోడలవిషయమై సహాయము చేయవలసినదనియు వ్రాసెనట, అక్కన్నగారికీ మోడల వర్తకము నుండెననియు, నప్పుడు రాజ్యమున * వరహాలు చెల్లుచుండెననియు తెలిసికొనవచ్చును. కనుకనే గోపన్న గారు వరహాలు వెచ్చించితినని పలికిరి.

* నలువదేండ్ల క్రిందటివఱకు గ్రామసీమలలో లోకవ్యవహారము వరహాలలోనే జరుగుట తెలిసినదే. వరహా రు. 3-8-0 లేక రు. 4/- గా భావింపబడెను.

ఇట్టి బహుప్రకారములగు వ్రాత నిదర్శనము లుండుట వలన అక్కన్న మాదన్నల మంత్రిత్వము తానీషా యొక్క నిరూపిత మగుచున్నది. తానీషా రామదాసును బంధించుట యిదివరకే వ్రాయబడెను. కాన నీ నల్వురి సమకాలికత్వము తెల్లమగుచున్నది.

అక్కన్న మాదన్నల వృత్తాంతము 'ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము' ప్రథమ సంపుటము 177-178 పేజీలలో కలదు. పై విషయములెల్ల Letters to Fort St. George Vol. II, pages 105-109 లోను, Press List of Ancient Records in Fort St. George లోను, Public Cons. Vol. VI, VII, VIII లోను కలవని యుం దుదహరింప బడినది.

శ్రీ జయంతి రామయ్యపంతులు బి.ఏ., బి. ఎల్. గారు 27-4-1339 ఫసలీ (1929) గోలకొండ పత్రికలో నొక వ్యాసము వ్రాయుచు, అక్కన్న మాదన్నల నెఱింగినవాడగు హేవర్టు అను డచ్చి దేశస్థుడు తన పేర నడుపుకొన్న యొకపత్రికలో, అక్కన్న మాదన్నలు బీదవారై తొలుత 1666 సం॥న మీర్జుమ్లా యను బిరుదముగల సయ్యదు ముస్తఫా యొద్ద స్వల్ప వేతనమున ప్రవేశించి వృద్ధి నందిరనియు, మాదన్నగారికి సూర్యప్రకాశరావను నామాంతరము కలదనియు, వీరి యజమాని మీర్జుమ్లా పదవీభ్రష్టుడయ్యెననియు, నవాబుగారు రాజ్యభార మంతయు

మాదన్నపై నిడి తాను జీవనార్థము 75000 హోలర్లు (హోలరు మూడు రూపాయలు) తీసికొనెననియు వ్రాసెనని తెల్పిరి. దీనివలన మాదన్న మహారాష్ట్రుడు కాడనియు, ఆంధ్రుడే యనియు నిశ్చయము బలీయమగుచున్నది.

## వలస వృత్తాంతములు

గోలకొండరాజ్య మంతరింపజేసి మొగలు చక్రవర్తి ఔరంగజేబు హైదరాబాదునకు తన ప్రతినిధిగ "గాజియుద్దీన్" ను నియమించెను. కాని 1707 లో ఔరంగజేబు గతించిన వెనుక ఢిల్లీనుండి "నిజాముల్ ముల్కు అసఫ్జా క్రీ. శ. 1724 లో దక్కను సుబేదారుగ నియమింపబడెనని తెలిసికొంటిమి. ఈతడు ఢిల్లీలో మొగలాయీలు క్షీణించుట గమనించుచుండెనేకాని దక్కనులో స్వయముగ రాజ్య మేలలేదు. 1. ఆర్కాటు 2. కడప 3. కర్నూలు 4. రాజమహేంద్రవరము 5. శ్రీకాకుళము అను 5 రాష్ట్రములుగ నొనర్చి సమర్థులగు అయిదుగురు నవాబుల యధీనమందుంచి రాజ్యతంత్రము నడపెను.

ఇంతటినుంచి శతాధిక వర్షములు దక్షిణభారతమెల్ల కల్లోలితమైపోయెను. ఫ్రెంచివారును ఇంగ్లీషువారును తమ తమ వర్తక ప్రాబల్యములతోపాటు పరిపాలనా కేంద్రము నేర్పరచుకొనుటకు ప్రయత్నించసాగిరి. మరాటీదండులతోను, తురుష్క దోపిడీముఠాలతోను జనపదము లరాజక భయావహ పరిస్థితులకు లోనయ్యెను. తఱచు యుద్ధములు

జరుగుచుండెను. ఆయా సర్కారులలోని ఫౌజుదార్లు లేక ఖిల్లాదార్లు గ్రామసీమలలో శిస్తులు వసూలుచేయుటకు బాధ్యులుగా పరిగణింపబడిన దేశముఖు దేశపాండ్యాలకు తగు సహాయము నందజేయ జాలకపోయిరి. పరిణామముగా తమతమ యధీనము లందున్న ప్రాంతములకు దామే సర్వాధికారులై జమీందారు లను వ్యవహారనామములతో బలవంతులు కాజొచ్చిరి. కొన్ని సందర్భములలో తిరుగుబాటు లొనర్చుటయు బరిపాటి యయ్యెను.

క్రీ శ. 1748లో నిజాముల్ముల్కు దివంగతు డగుటయు, రెండవ కొడుకగు నాసరుజంగు రాజ్యస్థితుఁడాయెను. మనుమడైన 'ముజఫరు జంగు'ను ఫ్రెంచివారు బలపరచు చుండిరి. తత్సహాయమున 1750 లో నాతనిచే నాసరుజంగు హతుడయ్యెను. ముజఫరు జంగుతో "బుస్సీ" యనబడు ఫ్రెంచి సైన్యాధినేత హైదరాబాదుకు తరలిపోవు చుండగా కడపవద్ద నెదుర్కొన వలసివచ్చిన యొక దుస్సంఘటనలో 1751 సంవత్సరమున ముజఫరుజంగు హతుడయ్యెను. వెంటనే నైజాముయొక్క మరియొక కొడుకు సలాబతుజంగును రాజ్యస్థితు నొనర్చిరి. ఈతని తమ్ములగు నిజామాలీ, బసాలతుజంగు లిరువురు కాలక్రమమున నొకరు ఔరంగాబాదులోను, మఱొకరు గుంటూరులోను బలవంతులై యుండిరి. ఇందొకరాంగ్లేయులకు మఱొకరు క్రమముగ ఫ్రెంచివారికి అభిమానపాత్రులై యుండిరి.

క్రీ. శ 1759లో ఇంగ్లీషువారిచే ఫ్రెంచివారు తరుమబడిరి. 1763లో నిజామలీఖాన్ ప్రభుత్వము స్థిరమయ్యెను. 23 ఫిబ్రవరి 1763 నాడు నిజామలీఖాన్‌తో బ్రిటీషువారు సంధి పత్రము నంగీకరించి గుంటూరు సర్కారును బసాలతు జంగుకు వదలివేసి మిగిలిన నాలుగుత్తరసర్కారులను కంపెనీకి కవులుపద్ధతిపై దీసికొన నిర్ణయించుకొనిరి. కాని మరల కలహము లేర్పడెను. తుదకు 1823 లో ఉత్తర సర్కారులు నైజామువారివని స్థిరపరచి కంపెనీవారు, రూ 11,56,666 లు నైజామునకు చెల్లించిరట.

నిజామల్లీఖాన్ పరిపాలనమున 1789 సంవత్సరమునందే భద్రాచల శ్రీసీతారామచంద్రమూర్తికి హసనాబాదు పరగణాకగాను ప్రత్యామ్నాయముగ సంవత్సరపువ్యయము నలుబదివేల రూపాయీ లివ్వవలసినదని స్థిరపఱుపబడెను.

ఈ యరాజకస్థితిలో భద్రాచలప్రాంతము అశ్వారావు బహద్దరుల యధీనమందున్నటుల తెలియుచున్నది. దేవాలయ భృతులు వారే జరుపుచుండిరి. 1769 ప్రాంతములో "ధంసా" యను తురుష్క సేనానాయకుడు ప్రబలి వరంగలు ప్రాంతమున బలిష్ఠుడై ఖమ్మంమెట్టు మీదుగా నిటువైపులకు దండయాత్ర వెడలి యొకరివెనుక నొకరు జమీందారుల దోచుకొనుచు దేవాలయముల కొల్లగొట్టుచు రాసాగెను. "ధంసా" యనునది బిరుదమే. మన కీతని విషయము తొలుదొల్త నెఱింగించి

నది భల్లా పేరయ్య యను నొక కవి. భద్రగిరిపై "ధంసా" దండయాత్ర చేసి జరిపిన దురాగతములు విపులముగ వర్ణించుచు నొక శతకమును వ్రాసి, "భద్రగిరిశతక" మని పేరిడెను. ఇందు చరిత్రాంశములు చాల గలవు. కవి యాకాలమునందే యుండి చూచి వ్రాసినటుల శతకమువలన తెలియగలదు. కవి నివాసస్థలము యితరవిషయములు తెలియబడుట లేదు. కాని, "యిద్దరికి వచ్చి" యని యొకచో వ్రాయబడియున్నందున పోలవరం గాని పశ్చిమగోదావరిజిల్లా వాడని గాని యెంచ వచ్చును. తురకల దాడికి భయపడి "పోలవరము" గ్రామము నకు శ్రీరామచంద్రుడు వలసవేంచేయుట చెప్పుచు దేవదేవుని భీరుత్వమున కాశ్చర్యపడుచు నిందాస్తుతి యొనర్చెను. ఇట్టి నిందాస్తుతు లాంధ్రకవిత్వ సాంప్రదాయములై యొప్పు చున్నవి. ఆనాటి పరిస్థితుల గన్నుల గట్టినట్లుగ నభివర్ణించెను.

'ఈపాటిదొరవని యెఱుగక మిమ్ము నమ్మి
అశ్వరాయుడు (భూ) పలాయనము (నంబు) నొందె'
'తమగుమాస్తా యనదగు నశ్వరాయని
కరుణమీరంగను గాంచలేక తొలగిపోతిరి'

అను మాటలచే శ్రీరామసేవాలాలసుడైన అశ్వా రావుగారు పలాయనమై చికాకుపడుట తెలుపుచున్నాడు. మఱియు నిందువలన శ్రీరామాలయ పోషణము వారియం దప్పటికే నిరూఢమై యుండుటయు, వారి కశ్వారాయ బిరుదనామము ప్రసిద్ధమగుటయు నేర్పడుచున్నది.

'గరుడాశ్వగజరథ వరవాహనములచేఁ
బఱగువీధులు కీర్ల ప్రభలజెందె,
మత్స్యమాంసాదికములు నమరెను గోద
రేవు లెచ్చటగన్న గోరీల నమరె'

నని పలుకుచు భద్రగిరిలోని నాటి హృదయవిదారకస్థితిని దృగ్గోచర మొనరించినాడు. ఇక దేవాలయ రంగము గనుగొనుడు.

వీటిబుచ్చిరిగదా వీరులచేఁ జెన్నొందు ఘనమల్లికా పుష్పవనచయంబు
గాసిజేసిరిగదా కళ్యాణమంటపాగారవాహన గృహాంగణము లెల్ల
చూఱవట్టిరి పురమెల్ల జొచ్చి విప్రమందిరములన్ని తురకలు మత్తులగుచు.

నాడు ధ్వంస మొనరింపబడిన పుష్పవన మింతవఱకు బునరుద్ధరింప బడదయ్యెను. ఒండు, రెండుమారు లట్టి ప్రయత్నములు జరిగి ఫలశూన్యము లాయెను. మఱల నిప్పు డందికొని కావింపబడుచున్నది. అతడు విఱుగగొట్టిన శాసన శిలా స్తంభములు మాత్రము 1832–1833 నందన సంవత్సర మున బునరుద్ధరింపబడినవి. ఈ దండయాత్ర కాలము,

సర్వధారని పేరి సంవత్సరమునందు
'ధంసా' కు వెఱచి యిద్దరికి వచ్చి
పోలవరంబులో బొలుపొంద నయిదేండ్లు
వనవాస మొనరించి వరుసతోడ
విజయ సంవత్సరంబున విజయముగను
భద్రగిరికేగి తౌనయ్యె భద్రముగను,
శ్రీరామచంద్రులు సీతాసమేతులై
వచ్చిరి భద్రాద్రివాసమునకు

జయ నామవత్సర చైత్రశుద్ధాష్టమీ
తరువాతి దినమందు దగ వివాహ
మరయు మార్గమునందు నొరయ సత్రముల బల్
చలువపందిరులు వెచ్చని జలములు.

అనియును దెలుపుటంజేసి సర్వధారి మొదలుకొని జయసంవత్సరమువఱకు వలసలోనుండుట విశదమగుచున్నది. నందనసంవత్సరము 1832-33 లో వచ్చుటచే సర్వధారి క్రీ. శ 1769 సంవత్సరము స్థిరమగుచున్నది. ఈ శతకమున దెలుపఁబడిన రామలదేవు, జోగిపంతులు, విజయరామరాజు, సీతారామరాజు, మొదలగువారి కాలమందే యుండిరి. కాంద్రేగుల జోగిపంతులు మచిలీపట్టణములో నింగ్లీషుకంపెనీ తరపున నుద్యోగిగానున్న "పైబస్" దొరకు దుబాసీగానుండి, వారికి నైజాంనవాబు "నిజామల్లీఖాన్" గారికిని సంప్రదింపులు నవంబరు 1764 నుండి ఫిబ్రవరి 1765 వఱకు జరిపెనని కృష్ణాజిల్లా చరిత్రకారుడు వ్రాసియున్నాడు. అశ్వారావుగారు భయముచే పలాయితులగుటం బట్టి యేదియుం దోపక తురుష్కులవారినుండి తప్పించుకొనుటయే తత్కాల కర్తవ్యముగా నెంచి బాధ్యతగల యర్చకస్వాములు శ్రీ రామదాసు యాభరణములు, నుత్సవమూర్తులను గూడ దీసికొని రెడ్డి పోలవరమునకు వలస నంగీకరించి కొనసాగించిరని తెలిసికొనగలుగుచున్నాము. మూలస్వామికి యర్చకు లొక యడ్డుగోడ నిర్మించి వెడలుటచే నపాయము తప్పిపోయెను. గాని "ధంసా" వలన రామదాస నిర్మిత శిలాశాసనములు ధ్వంసములయ్యెను.

పోలవరమునందు శ్రీ రామలదేవుగా రప్పుడు జమీందారుగా నుండిరి. వారత్యంత భక్తిశ్రద్ధల నొడ్పడిరి గాబోలు "శబరి విందయ్యెనే సరభసంబున మీకు భావింప రామలదేవు భక్తి" యని కవి పొగడెను. "కారణ జన్ములని తోచి యాతనికి వరమీయబోతివో" యనియు బలికెను. పోలవరమున నిర్భయముగ నుండుటకు కంపెనీవారి సహాయ మవసరమగుటచే రామలదేవుగారు వారి ననుసంధింపజేయుటయు, వారికార్యము నంగీకరించి రాజమహేంద్రవరమున సాధించుటయు "ఘనబుద్ధ్యమూక మయ్యెనె రాజమహేంద్రవరము" అనియు "జోగిపంతులకు మెచ్చులువల్క బోతివో యింగిరీజుల ప్రాపు నిచ్చగించి" యనియు "హనుమంతుడయ్యెనే అతిసాహసుండగు జోగిపంతులయుక్తి చూడ మీకు" ననియు విమర్శించి పల్కుచు "నన్ను ధన్యునిజేయ నాచేత పద్యముల్ చెప్పింప బూనుటో యొప్పమీఅ" నని వ్రాసి యకాలమున దానున్నట్లు వెల్లడించుకున్నాడు.

అశ్వారావుగారు దేశాంతరగతులగుటచే వలసకాలమునందు వ్యయ మెవ్వరు భరింతురను సమస్య యేర్పడియుండును. ఇందుకు దగినవా రక్కాలమున బలిష్ఠులగు విజయనగర మహారాజులగు పూసపాటివారు తప్ప నొండు సమర్థులు లేరని యూహింపబడి రాయబారము నడుపగల మార్గము లన్వేషించి బంబరు (మచిలీపట్టణము) లో గల "పరాసు" దొర "గోరుందొర" (ఆకాలమున నచ్చట ఫ్రెంచి అధినేత

"గోడెహూ" నట్లు పలికి యుందురు), యూతనికి మిత్రుడగు టచే నాతనిని సంప్రదించి కృతకృత్యులైరి కాబోలు. "సుగ్రీవుడయ్యె నే సారిది గోరుందొర కప్తాను ఘనుడు మీ కార్యమునకు" ననియు "పూసపాటి నృపాలుర బ్రోవదలచి, తెచ్చుకుంటివో మీ ఖర్చు వెచ్చమునకు" నను వాక్యముల బొందుపరచినాడు. కనుక పూసపాటి విజయరామరాజు, సీతారామరాజుగారలు వలసకాలమున నుండిరి. విజయ రామరాజుగారు బొబ్బిలియుద్ధపువారు కారనియు వారి భార్య చంద్రమ్మగారికి దత్తుడనియు పూజ్యశ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు నందన ఆశ్వయుజ "భారతి" లో వ్యాసమున దేల్చిరి.

ఈ శతకమున "ధంసా" యెవరను దెల్పు పద్యమున కవి, యతడు "ఇబరహీముఖాను" డనియు "ఫాజలుబేగు" "జాల్దుంగు" అతని పర్యాయనామము లనియు "ధంసా" యను బిరుదము నొందెననియు నర్థము వచ్చునట్లు నుడివి యున్నారు. పారసీక భాషలో 'ధంసా' యనుట బిరుద మీయదగినంత యర్థముగల పదమని తోపదు. జానపద ధ్వంసచర్యలకుం గడంగిన నితని గ్రామీణులు 'ధంసా' యనుటచే నీ బిరుద ముత్పన్నమై యదియే నిరూఢమైనదని నా యనుభవమున నూహించుచున్నాను. నైజాము తరపున ఖమ్మంమెట్టుజిల్లా యధికారిగా నియమితుడైన 'జాఫరుబేగు ఖాన్' అనునతడు ఆ జిల్లాను డిశంబరు 1767 సం॥న కర్నలు

హార్టు అను ఇంగ్లీషుదొరకు వశపఱచుటచే నీ కంపెనీవా రా తని కొక జాగీరు నొసంగిరనియు, తదుపరి నతడు బందరులోని ఫ్రెంచి అధికారి మాంజిన్ దొరతో రహస్యాలోచనము లొనర్చుచున్నట్లు కనుగొనబడియున్నందున నాతని బందీగా నొనరించి క్రమ్మఱ విడుదలచేయించి ఉపకార వేతనము మాసమునకు 150 పగోడా లిచ్చిరనియు ఆతడు గతించిన వెనుక నాతని కుమారునికి గూడ నిచ్చిరనియు కృష్ణాజిల్లా చరిత్రకారుడు వివరించి యున్నాడు. ఖమ్మంమెట్టు వ్యవహారమున నైజామునకు విరుద్ధముగ నడచుటయు ఫ్రెంచివా సతో మంతనము లొనర్చి కంపెనీవారికి కోపకారణమగు టయు స్వయముగ హింసాచర్యలకు గడంగుటయు కలుగు టచే జోగిపంతులు మొదలగువారి ప్రయత్నములు అనాయాసముగ త్వరితగతి సఫలీకృతములై పతనముంగన్న యీతడే 'ధంసా'యగునని నాతలంపు. వరంగలు ప్రాంతమున జాఫర్ గడ్ యను గ్రామముండుట ఖమ్మంలో జాఫర్ బావి యను నొకబావి యుండుట యిందుకు ప్రోద్బలము లగుచున్నవి. కంపెనీవా రొసంగిన యీ ప్రాంతమే యతని యల్పకాలపు జాగీరయి యుండెనని తోచెడిని. ఈ భద్రగిరి శతకమును శ్రీ వావిళ్ళవారు తమ భక్తిరస శతకసంపుటములో ముద్రింపించి ఆంధ్రుల కృతజ్ఞతకు పాత్రులైరి.

'ధంసా' విషయమును సాంగోపాంగము దెల్పు మఱి యొక కావ్యము 'శ్రీరామాభిషేకము'; దీనినే అశ్వారాయ

చరిత్రమనియుఁ జెప్పెదరు; ఆత్రేయసగోత్ర పవిత్ర శ్రీమాధవా మాత్యపుత్ర వెంకటరామనామధేయ ప్రణీతము; ఈ కావ్యము ముద్రితమైనట్లు నాకు దెలియదు. కవి నివాసకాలాదు లెఱుంగను. ఇందు మా వంశోన్నతులగు పూర్వుల విషయము లుల్లేఖింపబడి యుండుటచే నత్యాసక్తినొంది పూజ్యులగు నా జనకపాదులు వ్రాతప్రతినుండి యెత్తివ్రాసికొని యుంచిన కొన్నిపద్యములు నాకిచ్చుట నాధారభూతములైనవి. వ్రాతప్రతిగూడ మఱల నాకు లభించుటలేదు. ఇది ముద్రితమై యుండి యేదేని ప్రతి చిక్కినచో క్రొత్త విషయము లగుపడిన ముందు వివరించుకొందును. ఈ వ్రాసి యుంచబడిన 'నోట్సు' లో 'ధంసా' జననము క్రీ. శ. 1710 అని మాత్ర మున్నది. ఇక మిగిలిన వివరములలో మునుముందు 'ధంసా' మరణవిషయ మిట్లున్నది.

సీ. "మెఱసి రాజన్యుల చెరసాల బెట్టిన
మగధనాధుడు పోర మడిసినట్లు
సాంభకౌరూఢుడై జగమెల్ల నేచిన
సాళ్వమహారాజు సమసినట్లు
పన్నుమీరగ రాచకన్నెల జెఱగొన్న
నరకాసురుడు మేను దొఱగినట్లు
నమరుల వెట్టి కొట్టములుగొన్న దశాస్యు
డడలుచు గాయంబు విడిచినట్లు

గీ. ఘోరతీక్ష ప్రతాపముల్ నూఱపుచ్చి
తనదు పుత్రులు భార్యయు తల్లడిల్ల
తనువు ధంసా దొరంగెను, తనదు ధనము
దేశమును సంపదల బాసి యాశ లుడిగి.

కం. సుకరముగ శాలివాహన
శకవర్షము అబ్ధి గగన శైలేందువు లు
త్సుక ప్లవసంవత్సర మధుశుచి
వికసిక పంచమిని మేనువిడిచెన్ ధంసా."

(శా.శ. 1704 కు సరియగు క్రీ.శ. 1782 ప్లవసంవత్సర చైత్రశుద్ధ పంచమిని ధంసా మరణ మొందెనని తెల్పును.)

ధంసాకు జిక్కక పలాయనమైన యశ్వారావుల గుఱ్తెఱిగింపవలయునని శ్రీ కొండపల్లి కృష్ణారావుగారిని (మా పూర్వులలో నొకరు) గోరినట్లు క్రింది పద్యమువలన దెలియుచున్నది.

* సీ. చామీకరాచలోద్దామ దేశాధీశ
డార్య సన్నుతుడు వేదాంతవిదుడు
నిరతాన్నదాన విస్ఫురకీర్తిసాంద్రుండు
భూసురాశీర్వాదభాసురుండు
ప్రత్యర్థిమంత్రి ప్రభంజనోపాయుండు
మండిత కాంచనకుండలుండు
మహనీయ కారుణ్య మంజులస్వాంతుండు
సకల విద్వత్కవిప్రకర హితుడు

---

* కనగిరిపరగణా కధీశ్వరుడు. కల్లూరు మధిర తాలూకాలో గలదు.

గీ. భూరిసామ్రాజ్య వైభవ పూరితుండు
కొండపల్లి కులాంబుధి కువలయాప్త
డనఁగ బొగడొందు కృష్ణరాయాగ్రగణ్యు
నెలమి బిలిపించి మన్నించి పలికె ధంస.

"నీయందు న్నుపకారము న్నడచి తా నీదేశముం దోసికో
పాయం డోలిన మన్నెరాజు నృపతిన్ బ్రాపించి యున్నావు నీ
వీ యాజ్ఞం బెఱిఁగింపు నాకు మఱల న్నిప్పింతు నీ దేశమున్
దాయం దీసి సమస్త సంపదలు పొందం జేత నీ కీయెడన్"

ఇట్లు భేదోపాయముం బ్రయోగించె గాని "ధంసా" కృతకృత్యుడు కాజాలక దేశము పాడొనరించి తానును పాడయ్యెను.

ధంసా యనంతర మాతని కొడుకుగూడ నధికారము వహించెనట.

శా॥ ధంసాసూనుడు షర్గుమీర్జ యను నాతండున్ నిజామల్లిచే
తన్నాస్థానముగుం గితాబు బొలుపొందన్ హేతిరాజంగు పే
రు న్సంపాదన జేసి తండ్రిపగికిన్ రోషంబుతో యావనో
త్తంసాగ్రేసరుడై యఖండమహిమన్ ధాత్రీతలం బేలుచున్.

ఇందు ధంసా వెనుక నాతని కొడుకు 'నిజామలీఖాన్' నైజాము నవాబుచే మన్ననల నంది ఈ ప్రాంతముల కధికారియై వచ్చినట్లు స్పష్టమగుచున్నది. శ్రీ రామచంద్రాశ్వారావుగారు పాలవంచ సంస్థానమును మరల పొందుట కనేక ప్రయత్నములు రాయబారములు జరిపించిన ట్లీ గ్రంథమున

విపులీకరింపబడినది. తుదకు గృతకృత్యుడై తగినవారి సహాయమున పునఃప్రతిష్ఠు డయ్యెను.

మ॥ అరయన్ వారల కొండపల్లి కులజుండై యొప్పు చంద్రప్రభున్
వరుసన్ దంటగ వేర్పరించి పనుపన్, వారేగి స్తంభాద్రిలో
వెలనొప్పన్ నివసించు "నాయబును" ప్రావీణ్యంబుతో గాంచి హృ
త్సరసీజంబులు పల్లవింప "నజరుల్" సంప్రీతిమై నిచ్చినన్.

చ॥ కలువల రామచంద్రుడును గారవమొప్పగ మీరలున్ మహా
బలియుడు దేవినేని కులభవ్యు డనందగు పాపరాయుడున్
సలలిత కొండపల్లి కులజన్ముడు చంద్రపమంత్రియున్ సము
జ్జ్వలగతి నశ్వరాయునకు చాలగ నమ్మికనేయగా దగున్.

తే॥గీ॥ వందిమాగధగీతముల్ సందడింప
సకలజనములు గొనియాడ సంభ్రమమున
మిత్రజనములు నత్యంత మైత్రి నెఱప
రామచంద్రాశ్వరాయుండు ప్రేమ నెఱప.

ఇట్లు పునః ప్రతిష్ఠుండై సంస్థానాధిపత్యము వహించి తనకు సాయపడిన పెద్దల సముచిత గౌరవసత్కారములం గొనియాడి కీర్తిగొనుట కవి వర్ణించెను. ప్రౌఢకవిత్వము గాకున్నను నప్పటి చారిత్రక విషయము నున్నదున్నట్లు వివరించినాడు.

ఈ చరిత్రమున మఱొక వలస వృత్తాంతముగల కథాంశము వెలువడుచున్నది. బెజ్జదేశమున (బస్తరు ప్రాంతమున నీ సరిహద్దులవెంట గలదట. ఇది కాకతీయ చక్రవర్తి ప్రతాపరుద్రునిచే తనముందు ఖడ్గధారియై నడచినవానికి జాగీరుగా

నొసంగబడినది.) గల కమలాపుర గ్రామమునందు శ్రీరామ చంద్రాశ్వారావుగారు శ్రీ భద్రగిరినాథుని కొంతకాలము నిలిపి యుత్సవములు గొఱతవడక జరిపించి తిరిగి భద్రాచల మునకు (క్రీ.శ. 1785 కు సరియగు) శోభకృతు సం॥ మార్గశిర శుద్ధ సప్తమి సోమవారమునాడు తోడ్కొని వచ్చి పునః ప్రతిష్ఠ యొనర్చిరట.

సీ. బెజ్జిదేశములోన పేరు విఖ్యాతిగా
రహినొప్పు గమలాపురంబునందు
నున్న తానుంచి సమ్మోదంబు నిండార
పరమోత్సవంబు లేర్పడనొనర్చు
కతన నచ్చోటికి కదలిపోవలెనంచు
వెలయు నర్చకులును వీరభటులు
వలనొప్పమంత్రులు వాహనసముదాయ
మార్యసంఘంబు లాచార్యవరులు
గీ. భూసుతాధిపు వెంచేపు చేసికొనుచు
రాగలందులకును వెంట దూగినడువ
భూరిసంతోష వైభవస్ఫురణ మెరయ
రామచంద్రావనీంద్రుండు రమణవచ్చె.

శ్రీ రామచంద్రార్వారావుగారు కమలాపురమునకు వైభవోపేతులై యేగి శ్రీ స్వామివారిముందు తాము పాద చారులై యఖండ ప్రాభవముతో భద్రగిరికి వచ్చుట కవి వర్ణించెను. మఱియు

చ. అరయగ శాలివాహన శకాబ్దములన్ క్రతుపుష్కరాద్రిభం
వరులను గల్గు శోభకృతువత్సర మార్గశిర ప్రశుద్ధమం

దిరవగు సప్తమిం దనరు నిందుని వారసమందు రాఘవే
శ్వరు దగ నశ్వరాయు నృపవర్యు డొనర్చెను సుప్రతిష్ఠయున్.

అనుపద్యమువలన వలసప్రారంభ మెప్పుడోగాని పునః ప్రతిష్ఠ మాత్రము శా. శ. 1706 కు సరియగు 1784 శోభకృతుసంవత్సర మార్గశిర శుద్ధ సప్తమీ సోమవారమున జరిపించిరని వ్రాసినారు. ఇది 1725 లోని శోభకృత్తనుకొనవీలుండదు. అప్పటికి మొదటి నైజామే సుస్థిరుడు కాలేదు. ప్రాంతము లెల్లను జమీందారుల హస్తగతములై నిరంకుశ పరిపాలన నుండుటచే వలస కవసరము కనుపించదు. ఇక 1845 లోని శోభకృత్తనుట కుదురనివిషయము నాల్గవ నైజాము కాలము, ప్రశాంతవాతావరణము, కష్టకాలము లెట్టివైనను క్రీ. శ. 1740-1790 వఱకే కన్పించుచున్నవి. మాటిమాటికి మార్పులు కన్పటు టప్పటికి పరిపాటి యయినది. క్రీ.శ. 1775 లో నిచ్చట పోలవరమునుండి తిరిగి వచ్చిన వెనుక 'ధంసా' వలననో మఱి యే యితర కారణమువలననో భయావహస్థితి వాటిల్లినప్పుడు బెజ్జి దేశములో నించుక స్థిరత్వము తలదాచుకొనుటయం దేర్పడి అశ్వారావు లీ రామసేవల విడువనొల్లక కమలాపురమునకు రప్పించుకొని 'ధంసా' యస్తమించి శాంతి చేకుఱి తమ సంస్థానము దామ పొందగల్గుటచే గ్రమ్మఱ క్రీ. శ. 1785 లో భద్రగిరిని పునః ప్రతిష్ఠింపజేసి రామానుగ్రహ మొందుట భావింపవలసి వచ్చుచున్నది. యే యాధారము లేక యిట్టివి కవి కల్పించడుగదా !

అసలు అశ్వారావుల పుట్టు పూర్వోత్తర మిట్లు
గ్రాసెను :

సీ. అలరంగ శాలివాహన శతాబ్దంబులు
సామజాంభోరాశి శరమ్ర్యగాంకు
లనుగల్గు రాక్షసాహ్వాయవత్సరంబున
సర్వాశ్వరాయ భూచక్ర విభుడు
పఱగంగ హాస్సనబాద శంకరగిరి
మనసబు గైకొని ఘనతమీఱ
తనరాజధానికి తగిన పట్నంబని
వలనొప్పగా పాలవంచపురము
నందు భూగుర్గ మొనరించి యఖిలజనులు
ప్రీతిగావింప సద్గుణోపేతు డగుచు
తత్పురంబున నివసించి ధాత్రి యేలె
భూరిరవమైన నౌబత్తు బోరుకలగ.

శ్రీ సర్వాశ్వరాయ బహద్దరువారు ప్రప్రథమమున శా.శ. 1548కి సరియగు క్రీ. శ. 1626 రాక్షస సంవత్సరమున హాస్సనాబాదు శంకరగిరి ప్రాంతమును మనసబు గైకొని పాలవంచ ముఖ్యపట్టణముగ నేర్పఱచికొని కోటగట్టుకొని పాలనవ్యవస్థ స్థిరీకరించుకొనిరని దెలుపబడుచున్నది.

శకములనుబట్టి చూడగా 1626 క్రోధన యగుచున్నది. రాక్షస సరిగా 10 సం. క్రింద వచ్చుచున్నది. యీ పొరపా టెట్లు వచ్చెనో తెలియరాకున్నది. వారి వ్రాత కాధారము తెలిసియున్నచో కొంతవఱ కాలోచింప సహాయపడియుండె డిది. ఎట్లయినను నా కాలముమాత్రము తానీషాకు పూర్వు డగు క్రీ.శ. 1611 నుంచి గోలకొండను పాలించిన 'అబ్దుల్లా'

నవాబు పరిపాలనములోనిది. తొలిసారిగా నాతడే వారి కీ ప్రాంతము నొసంగి "సవై అశ్వారావు" బిరుదము నొసంగెనో! సవై అశ్వారావు బిరుదు 125 అశ్వికదళము నుంచ వలయునను నిర్ణయమును దెలుపును. ఆ తరువాత కాలముల యందు పైన పేర్కొనబడిన శ్రీరామచంద్రశ్వారావులే గాక క్రీ. శ. 1859 లో శ్రీ సీతారామచంద్రస్వామి అశ్వారావు బహద్దరువారికి సంక్రమించునంతకు ననేక పర్యాయములు విరోధము లేర్పడి మార్పులు చెందినట్లు స్పష్టమగుచున్నది. కనుకనే తానీషా నవాబు శ్రీ రామదాసుగారి కొసంగుటయు, నదియు నిలువనప్పుడు శ్రీ చందులాలు మంత్రి శిఖామణి శ్రీ రాజా తూము లక్ష్మీనరసింహదాసుగారి కొసంగుటయు జరిగిపోయినవి.

ఇవి యిట్లుండ మరొక వృత్తాంతము సన్నిహిత వర్గంబుల ననుశ్రుతమై ప్రసిద్ధముగ నున్నది. ఒకపరి మహోపద్రవకరమగు నరాజక పరిస్థితి యేర్పడిన, నర్చకస్వాము లొక యుపాయంబు పన్నిరట. ఉత్సవమూర్తుల ముగ్గురిని గోదావరీ గర్భమున డాచి తాము నక్కడక్కడ దాగియుండిరట. ప్రమాదము తీరినవెనుక వెదుకగా శ్రీరామలక్ష్మణమూర్తులు మాత్రమే లభ్యములై శ్రీ సీతాస్వరూప మగుపడ లేదట. భక్తులు వాపోవుచుండ నొకరి స్వప్నమున యాచార్యరూపమున దర్శనమొసంగి, పృథ్వినంటిన సీతాసతి మరల రానేరదనియు, ఇట్టి మూర్తియే ఫణిగిరిలో నున్నదనియు నానతిచ్చి

రట. వెంటనే కొండ రుద్యమించి నల్లగొండజిల్లాలోని ఫణి గిరి కరిగి రామాలయమునకు యాత్రికులవలె ప్రవేశించి యచటి రహస్యముల దెలిసికొని యొకనాటి రేయి సీతా విగ్రహమును దొంగతనముగ దెచ్చిరట. వెనుదఋముకొని యచ్చటి యాలయాధికారులు వచ్చువర కిచ్చట ప్రతిష్ఠ జరుగుటయేగాక ఆకస్మికముగ గోదావరి పొంగి వచ్చుట వలన రాసాధ్యముగాక వెనుకకు మఱలిరట. జనప్రసిద్ధిగల ఇటీవలి వృత్తాంత మగుట నమ్మబడుచున్నది. ఇట్లెన్నియో గడ్డురోజులు గడచినవి. కాని యుపాయాంతరములచే విజ్ఞులప్రమత్తులై యుండి తప్పించుటంజేసి, భద్రాద్రిరామ స్థితికి భద్రము తప్పలేదు.

నిజామలీఖాను 1803 లో మరణించెను. మీర్ సికం దర్ జాహ్ సింహాసనస్థుడై 1829 వఱకును, తరువాత నాస రుద్దౌలా 1857 వఱకును, అఫ్జలుద్దౌలా 1869 వఱకును, మహబూబలీఖాను 1911 వఱకును, క్రమముగ బరిపాలించి హైదరాబాదు నవాబులీ దేవాయతనముపై ప్రత్యేకాభి మాన ముంచిరి. తరువాత నవాబు "మీర్ ఉస్మానలీఖాను" పేరుగల రాజప్రముఖుని యాజ్ఞాప్రకారము హైదరాబాదు ప్రభుత్వముచే నిది నిర్వహింపబడి, ఆంధ్రప్రదేశమవతరించిన తర్వాత 1958 డిశెంబరు 6వ తేదీన హిందూదేవాదాయ ధర్మాదాయ ప్రభుత్వశాఖ కనుబంధింపబడి నిర్వహింపబడు చున్నది.

## భద్రగిరి వరద రామదాసు
## తూము లక్ష్మీనరసింహదాసు

రామదాసు ననంతరము దేశమంతట మహాప్రఖ్యాతి గడించిన ఈ మహాక్షేత్ర సందర్శనాభిలాషులై ప్రయాణ వ్యయశ్రమల నాలోచింపక నలుమూలలనుండి యాత్రికులు మహాప్రవాహముగ శ్రీసీతారామచంద్ర కల్యాణోత్సవముల కేటేట వచ్చుచుండిరి. ముద్రితములు కాకున్నను అప్పుడే యానోట నానోట నల్లుకొనిపోయిన "రామదాసు ఖైదు కీర్తనలు" బ్రహ్మానందముగ బాడువారును, వినువారును, నృత్య మొనర్చువారును, రామదాసు దుఃఖములో లీనమై దుఃఖించువారును, యిచ్చోట మన శక్తికొలదిగనే వస్తు వాహనము లొసంగి రామదాసు కైంకర్యములకు ప్రక్క ప్రక్కలుగ నిలుపుకొను భాగ్యము కలిగించుకొనజాలుదు మని పరిపరివిధముల దలంచువారును, యిక్కడనే గడువవల సిన జీవితకాలమును గడుపుకొందుముగాక యని నిశ్చయించి యుండిపోవువారును, భాగవతసేవ సులభాతిసులభమగు మోక్షసాధన మని తలంచి వచ్చిపోయెడి యాత్రికులకు బరి చర్య లొనర్చువారును, భద్రాచలమున గలుగుచుండిరి. అట్టివారిలో మహాభాగవత శిఖామణులగు నాగెండ్ల వరద రామదాసు, తూము లక్ష్మీనరసింహదాసు అను వా రిరువురు నీ దేవస్థలము నుద్ధరించిన మహాత్ములై చిరస్మరణీయులైరి.

పందొమ్మిదవ శతాబ్దమున దొలి రెండవ దశకములో జెన్నపట్టణమునుండి వరద రామదాసుగారును, గుంటూరు పట్టణమునుండి లక్ష్మీనరసింహ దాసుగారును నేటేట దప్పని సరిగ కల్యాణోత్సవ సందర్శనాగతులై యొకచో గలిసి కొనుచు, నర్మధర్మ సంభాషణముల బ్రొద్దుపుచ్చుకొనుచుం డెడివారు. ప్రస్తావవశమున భద్రాచల శ్రీరామాలయ పరిస్థితుల ముచ్చటించుకొనుచు దగిన యాజమాన్యము లేకపోవుటచే నానాటికి క్షీణదశ నొందుచుండుట గమనించి యాలోచించెడి వారు. రామదాసుగారొసంగిన వృత్తులు మాన్యములు మొదలైన వంతరించి యాయన నిల్పిన సేవాప్రకరణములు గూడ తగ్గిపోవుటచే భీతి యుదయించినది. ఉపాయాంతరము లన్వేషింప నారంభించిరి. లక్ష్మీనరసింహ దాసుడు భక్తుడు, వక్త, కవి, వ్యవహారనిపుణుడు, లౌక్య తంత్రముల నెఱింగిన నయశాలి, శ్రీరామమంత్ర జపధ్యానపరాయణుడు, ఆర్థికపటిష్ఠత లేనివాడు. వరదరామదాసుగారు భాగవతధర్మము లెఱింగిన ప్రపన్నశిరోమణి, విశేషధన సంపత్తికల మహనీయుడు, త్యాగరతుడు, నిరంతర వ్యాధి పీడితుడు. సుమారు పది సంవత్సరము లీరీతి గడచిన పిదప పరిస్థితులు మరింత జెడుచుండుటజూచి, యిరువురి మైత్రిచే నేదైన మార్గము త్రొక్కవచ్చుననియు ఈ క్షేత్రమును రామదాసువై పునర్వ్యవస్థీకరించుటకు నీవు దక్షుడవనియు నృసింహ దాసుగారు వరదరామదాసుగారి నుబోధించిరి. తనవలన

కాదగినది ద్రవ్యసహాయ మొకటే గనుక నందుకు సంసిద్ధుడ ననియు, పై భారమంతయు దమ దేననియు నృసింహదాసున కాయన బదులాడి యూరకుండెను. అంత నత్యంత సంతోషిత స్వాంతుడై నృసింహదాసు వరద రామదాసు నుద్దేశించి "నీమనంబునందలి సందియంబు నే నెరింగితి. క్షీణబలుడనయిన నా యసువు లెప్పు డెప్పుడు పోవునో, పట్టినపని తుదముట్ట దేమో యను బాధ నొందుచుంటివి. కాని రామ కార్యమైన కట్టుతిగులునట్టి దేదియు లేదని నా నమ్మకము; నాపై విశ్వాస ముంచిన నేడే కార్యదీక్షితుడనై యిలువెడలి నవాబు సన్నిధానమున కరిగి తగినయాజ్ఞాపత్రికను నీ పేర దెత్తునుగాని విడుతునా" యనియు, "నీ యసువులకు నా యసువులు మూడి పైతు" ననియు "మనమైత్రి రామసుగ్రీవమైత్రియై వర్ధిల్లు గాక" యనియు "యిందుకు నే దప్ప" ననియు బాస జేసెను. వరదరామదాసు పరమానందమున నమిత్రుని కౌగలించు కొని యిదే చెన్నపురమునుండి తరలింతుననియు, కానిక భద్రగిరి వరదరామదాసు పేర బరగెననియు మనసర్వస్వము శ్రీరామునిదే యనియు వాక్రుచ్చెను. అట్టినపుడు పరమ మైత్రి నవలంబించి రామసాన్నిధ్యమునకరిగి ప్రణమిల్లి తమ్ము గృతకృత్యులం జేయవలయునని, సగద్గదికముగ ప్రార్థించి, వేడుకొని, యొకరు చెన్నపురికిని, మఱొకరు హైదరాబాదునకును పయనముగట్టిరి.

భద్రగిరి వరద రామదాసుగారు చెన్నపురమునుండి

తగవలిచ్చిరి. భార్య ఆలయము సమ్మార్జనము, నిత్యనవీనరంగవల్లీ విరచనము, నవవికచ సుమదామ సమలంకారము, భాగవత జన సహావరణాద్యనేకవిధ కైంకర్యము లొనర్చుచుండెను. యోగిజన కల్పుండగు ననల్పత్యాగశీలుడు వరదరామదాసు తన గేహమునం గల సర్వాభరణములు రామార్పణ మొనరించి యుచితరీతిని స్వామికి సేవజేయుచు కాలము బుచ్చుచుండెను.

అట హైదరాబాదున కేగిన తూము లక్ష్మీనరసింహదాసు, నవాబు సందర్శన మెట్లగును? అమాత్యశేఖరు లెవరు? ఎట్లు సందర్శింప గలుగుదునని విచారింప నారంభించెను. నవాబు నాసరుద్దౌలా యనియు, గుణవంతుడనియు, ముఖ్యమంత్రి శ్రీ చందూలాలుబహద్దరనియు, అత్యంత త్యాగ వినయ శోభితుడనియు దెలిసికొనెను. సుమారొక మాసము వఱకు శ్రమించి ఎట్టకేలకు సచివాగ్రణి మందిరమునకు బ్రవేశము గల్పించుకొనెను. భద్రాచల నివాసుడననియు, ఒకానొక రామకార్యార్థినై వచ్చితిననియు దాసుగారు తెల్పగనే యమాత్యగ్రామణి చిరపరిచితునింబోలె నాహ్వానించి, యభ్యంతర గృహంబునకు దోడ్కొనిపోయి, మజ్జన భోజన నవీన వస్త్రాద్యలంకారముల సంప్రీతుం జేసి, యర్హమగు వసతిగృహమున నుండ నియమించెను. దినములు క్రమించుచున్నను సెలవీయలేదు సరిగదా, వచ్చిన కార్యమైనను దెలిసికొనకపోయెగదా యని నృసింహదాసు విచారించెను. కాని

తన యిష్టదైవ మంతకుముందే యీ కార్యము సాధించెనని యప్పటి కెఱుంగడయ్యె. చందూలా లీ భాగవతోత్తముని గురువుగా నంగీకరించి రామమంత్రానుష్ఠానము లీతనిచే దెలుపంబడినవాడై, యొకనాటి రాత్రి దినచర్యలు ముగించి విశ్రమించుతరి మృదుమధుర సంభాషణము లొనర్చుచు, భద్రాద్రినుండి యేతెంచు భక్తుని వాంఛ లీడేర్పవలయునని రామాజ్ఞ యిదివఱకే యైనదనియు, తనగృహము పావనం బగుగాక యని యిన్నాళ్ళూరకుంటి ననియు, యిక తడయుట యుచితముగా కన్పట్టదనియు, తమ మనోగత మెఱింగింప వలయునని దాసుగారి నర్థించెను. లక్ష్మీనరసింహదాసుగా రాలయ పరిస్థితుల దైన్యదశను విన్నవింపగా చందూలా లిక ముం దట్లు జరుగకుండుగాక యనియు రామదాసుగారి కైంకర్యముల వరుసకు భిన్నము గారాదనియు, నట్టివెల్ల దెల్పుచు నొక నివేదిక నొసంగుమనియు దెల్పెను మరియు దన గురు డగుట దగిన గౌరవప్రపత్తులు గలుగవలెనని, "శ్రీరాజా" యను బిరుదనామ మనుగ్రహించెను. రామదాసు కైంకర్యముల బునరుజ్జీవింప జేయుచున్నాడు గనుక రామదాస నామ మునుగూడ తన్నామమునకు జతపఱచవలయునని కోరెను. ఈ తీరున "శ్రీ రాజా తూము లక్ష్మీనరసింహ రామదాసు" గా నాడే మాఱిపోయెను. రాజు దలంచిన నేది యాగును. భద్రాద్రి శ్రీ రామాలయ నిర్వహణమే గాక దాసుగారి యాదేశముపై భద్రగిరివరద రామదాసుగారి సంతకముతో

శ్రీ రామచంద్రమహాప్రభువువారి మొహరుతో నీ పాలవంచ ప్రాంతమెల్ల నడిపించుట కధికార మీయబడెను. శ్రీ దాసు గారు ఖరసంవత్సర ఆషాఢ బహుళ ౧౪ నాటికి భద్రగిరికి విచ్చేసి సవిస్తరము వరదరామదాసుగారికిం దెల్పిన వారును శిరసావహించి కార్యభారము నంగీకరించిరి. రేపటినుండి జరుగవలయు రీతులెల్ల సమగ్రముగ నాజ్ఞాపించుచు ఖర నామ సంవత్సర కార్తీక శుద్ధ నవమీ భానువారమున పెద్ద యర్చకులపేర నొక హుకుము వ్రాసి ఇచ్చిరి. ఆ కాగిత మిప్ప టికిని వారి వంశీయుల చెంత భద్రముగ నున్నది. పైన గల మొహరు, చివరి సంతకము ఫోటోప్రతు లిందు చూడనగును.

నందన సంవత్సర చైత్రశుద్ధ భానువారమున క్రీ. శ. 1832 నే త ద్విషయము లెల్ల సవిస్తరముగా నుల్లేఖించుచు, రామలక్ష్మణు లను పేర రెండు పొడవైన శిలాఫలకములపై నలువైపుల శాసనములు జెక్కించి భద్రుని కభిముఖముగ ప్రతిష్ఠించిరి. నృసింహదాసుగారు తమ భావ మసదృశభక్తి భావతరంగితమై యూగిసలాడ ననేక గద్య పద్య గేయ చూర్ణికాదుల విరచించి ఆయా సమయముల దగిన భక్తశిఖా మణులచే బాడించి నిత్యోత్సవముల శతాధికరంజనముల నొనర్చి కృతప్రతిజ్ఞు డయ్యెను. నేడు జరుపబడు నుత్సవము లెల్ల వారిచే బునరుద్ధరింపబడినవే. ప్రభుత్వోత్సవమున భక్తిభావ మిను మడించునట్లు కంకంటి పాపరాజు గారి యుత్తర రామాయణము లోని రాముని కొలువుకూటము

వర్ణింపబడిన పద్యముల జతగూర్చెను. ఇట్టి రసవంతములగు రామదాస త్యాగరాజ జయదేవ కృష్ణతరంగ కీర్తనల నాలపింప జేసెను. దాసుగా రానాడు మిగుల జనరంజకముగ లొనర్చిన ప్రభుత్వోత్సవ పవళింపుసేవ లీ నాటికినీ ప్రాముఖ్యత గాంచి యొప్పుచున్నవి.

ఈ మహనీయుల పరిపాలనమున ప్రజలు నిజధర్మకర్మపరులై దైవభక్తి పెంపొంద మిక్కిలి సుఖంచిరి. వాహనాద్యలంకారములు పుర సేవల ప్రకరణములు హెచ్చింపబడెను. గోదావరి యొడ్డున నిర్మింపబడిన పునర్వసు మండపము వరదరామదాసుగారి దే.

ఇట్లుండ నప్పుడే నందన కఱువని చారిత్రక విఖ్యాతి గన్న మహాక్షామ మత్యంత భీకరముగ నలముకొని జనసందోహమును సంక్షోభింపజేసెను. ఈమహాభక్తయుగళ మించుకేనియు వెనుదీయక పలుచోట్ల పాకశాలలు నిర్మింపజేసి "అన్నమో రామచంద్రా" యని వచ్చువారల కెల్లరకు రామచంద్రు డన్నము పెట్టినా డన్నట్లు సంతృప్తి పఱచిరి. ఆ యన్నము పులుసుకుండము లిప్పటికిని నచ్చటచ్చట గన్పట్టును. పలుతావులనుండి కేవలమన్నాతురులై గుంపులు గుంపులుగ వచ్చి యిచ్చోట గొంతకాల ముండిరని జెప్పబడుచున్నది.

ఇప్పటి కీ దాసద్వయము సీతాపతి కైంకర్యము లొకరెండు సంవత్సరములే జరిపిరి. ఇంతలో కాలము సర్వా

కృతి నొందినది. వరదరామదాసుగారి రుగ్మత అప్పటి కప్పుడే ప్రబలమై శ్రీరామనామస్మరణముతో సాయుజ్యము నొందెను. నరసింహదాసు విశేషముగ దుఃఖించి ధైర్యమవ లంబించి కార్యనిశ్చయుడయ్యెను. మిత్రుని కొసగిన బాస తప్పరాదని భావించి విజయసంవత్సర భాద్రపద కృష్ణ చతుర్థి సౌమ్యవార మగు నానాడు వైకుంఠప్రయాణమున తోడు రాదలచినవారు రావచ్చునని యూరివారల కెఱింగిం చెను. అనేకులు దాసుగారిని వెంబడించి కొందఱు మన స్ఫూర్తిగను మఱికొందరు మొగమాటమునకును నీ వైకుంఠ యాత్రికులలో జేరిరి. గోదావరి యొద్దు లొత్తుకొని పాఱు చున్నది. వరదరామదాసుగారి శవమునకు విశేషాలంకారము లెన్నియో జేసిరి. భక్తులెల్లరు నూతన వస్త్రములు ధరించి యూర్ధ్వత్రిపుండ్రధారులగుచు తంబురా చిరుతాళములుచేత ధ్వనింప హరిగానములు చేయుచుండిరి. నృసింహదాసుగా రంతకుముందే బెస్తవారల బిలిపించి జాగరూకులై యుండ వలసినదనియు, ఆర్తుడై యఱచినవాని, నొడ్డుకు జేర నాయాస పడువాని తత్క్షణరక్షణకై సుశిక్షితులైనవా రుండవలయు నని యాజ్ఞాపించిరి. శవమునకు ముందు వెనుక లత్యుత్సాహముతో బెండ్లికిం బోవువారివలె నృసింహదాసు తదనుచరులును శ్రీ రామదాసు పరమపద కీర్తన “తక్లిపోతాము చాలదయ యుంచండి, మళ్ళీ జన్మములు లేవు మఱచిపోకండి” యను

దానితోపాటు * "పోయెదమయ్యా వైకుంఠమునకు" అను నరసింహదాసుకీర్తన బాడుచు సెలవు గైకొని, గోదావరి దరి కేగి, లతాపుష్పమాలాలంకృతమగు నొక్క పెద్దపడవపై వరదరామదాసుగారి శవము నుంచి చుట్టు నెల్లరు నధిరోహించిరి.

నృసింహదాసుగా రెంత జెప్పినను వినక, యింకను దనకాయుః ప్రమాణము మిగిలియున్నదని బోధించినను గైకొనక, యా ర్తింగూడి యెడబాటు సైపజాలక, తత్సతీమణియు వెంబడించెను. పడవ నడిపింపబడెను.

నదీమధ్యమున ముందుగా వరదరామదాసుగారి శవ

* కీర్తన పూర్తిగా నిచట జగువరు లెరుంగవలెనని వ్రాయబడుచున్నది.

'పోయెదమయ్యా వైకుంఠమునకు బోవుచున్నాము
శ్రియఃపతిని దలచి భక్తిశ్రేణులకు దండములు బెట్టి —॥పోయెద॥
కాళ్ళకు గజ్జెలు గట్టి కరమున తంబుర బట్టి
మళ్ళీ జన్మము లేనియట్టి మార్గమున రాముని కడకు —॥పోయెద॥
మోదము గోదావరి నాధారముగా జేసికొని
సాధుజనుల వెంబడి మేము సరగునను శ్రీరాముని జూడ —॥పోయెద॥
వాసిగాను వరదరామదాసు వెంబడి మే
మీ సంసారవాంఛల కోసివేసి సాక్షాద్రాముని జేర —॥పోయెద॥
కూరిమి రాముడిచ్చిన భూరి సంపద్వ్రాశిమెల్ల
కోరికలార గ్రమ్మర శ్రీరాముని సన్నిధి జేర్చి —॥పోయెద॥
కోరి యీ శరీరముల శౌరి కర్పణము సేయ
శ్రీరామ భక్తులును నారసింహదాసుడు నేనును —॥పోయెద॥

మును బడద్రోసి, నృసింహదాసుగారు తాము ను గుభిల్లున దుమికిరి. వెనువెంట నొకరొకరుగా నందరు నట్లేయొనరించిరి. ఇట్లు నదీగర్భగతులగు పదునెనమండుగురు భక్తులలో దాస యుగళము మరి యైదుగురి శవములు కనుపించలేదట. మిగిలినవారు రక్షింపబడిరట. అట్లు పరమపద మందినవారి వంశీయుడు శ్రీరంగం శేషావతార మిప్పటికిని స్వామి సన్నిధిలో హరిదాసులలో నొకరుగ నున్నారు. శ్రీ నరసింహదాసుగారి భార్య ముమ్మా రొడ్డుకు వచ్చి మరల నదిలో బ్రవేశించియు, చివరకు చెట్టునకుం జిక్కుకొనియుండి పతి ననుసరింపజాలక పోయెనట. మరికొంత కాలము జీవించి యొక కుమారుని దత్తునిగా గొనిరి. తద్వంశీయు లీ పురమున గాపురమున్నారు. తాము సీతారామదాసుగా నొక కవియు భక్తుడు నై యిచట చేరొందెను. 'భద్రాచలరామచంద్రమాహాత్మ్యము'తో బాటు ననేక కృతులు రచించెను.

భక్తకవిగా పరిగణింపబడిన నీ భద్రగిరి వరద రామదాసుగారే తొలుదొల్త రామదాసు చరిత్రమును రూపొందించిన మహాశయుడు. రామదాసు ఖైదుకీర్తన లని ప్రజలలో వ్యాప్తింగన్న వెల్ల గైకొని, స్వీయ గద్యపద్య ద్విపదలను తోహర రగడ మొదలగునవి గూర్చి హరికథాగానమున కనుకూలముగ జరిత్రమును వ్రాసెను. మరికొంత కాల మిట జీవించి యుండెనేని భద్రాచలమున బ్రతిప్యక్తియు తత్కథనమున నేర్పరియై వంశానుపూర్వికగా భాగవతు లిట వెలసి

యుందురు. ఆ రచన యించుమించు చణిగిపోయి దేశవ్యాప్తము కాలేదు. కాని అందలి కథాంశముల నందికొని కొన్ని మార్పులు కూర్పులు యథోచితముగ నొనరించి, సింగరిదాసను నొక కవి నేటికి వాడుకలోనున్న రామదాసచరిత్రము వ్రాసెను.

'రామదాసు కథ వరదరామదాసు
రచించెను సూచనగ,
ప్రేమతోడ సింగరిదాసీ కథ
ప్రకటన పరచెను బాగ.'

యని తన గ్రంథాంతమున వ్రాసెను. హరిభజన సింగరిదాసని పేరు వహించిన నీత డీకథను స్వయముగా బాడి కీర్తిగడించెను. వరదరామదాసుగారి తరువాత నీతడు కొలది కాలమునకే జన్మించి యుండునని యూహింపవలసి యున్నది.

భాగవతపండితోత్తముడై వెలసి, గులాబిపూవువలె తన భక్తిప్రపత్తి విలాససౌరభ మొకటిరెండు క్షణములు మాత్రమే యిచట వ్యాపింపజేసి, పరమపదయాత్ర నొనరించిన శ్రీ తూము లక్ష్మీనరసింహదాసు నైనను, బకాయి శిస్తులకు భయపడి ఆత్మహత్య చేసికొనిరని ప్రచార మొనరించిన వారలును గలరట. ఆత్మహత్య లరికట్టగలుగు ప్రభుత్వాధికారు లెటకేగిరో, మహాక్షామము దాపురించిన నొకే సంవత్సరమున విరివిగ నన్నదానము జేసిన యతడు బాకీ యెట్లు పడెనో, ప్రభుత్వమునుండి హుకుములు పొందిన మజుసటి

సంవత్సరపు శిస్తునే బాకీపడుట రాజనీతిజ్ఞున కెట్లు సంభవమో, కల్పవృక్ష మనదగిన మిత్రు డుండ నతనికి లేమి యెక్కడిదో, అటులేయైన యీ బాకీని రాబట్టుకొనక ప్రభుత్వమీ దేవస్థానమును నడిపింప మార్గాంతరముల కేల దిగెనో, తోడివారంద రేయీపదల మునిగి వఱదలపాలైరో పూర్వాపరముల యోజింపరైరి. రాము డొసగిన 'భూరి సంపద్వ్రాతమెల్ల' రామునికే యొసంగి చనుచున్నానని పాడుకొనుటయు గమనింపరైరి. నిర్హేతుకములగు నిట్టి యారోపణలవల్ల తమ స్వకపోలకల్పితములగుటం బట్టి క్రొత్తదన మాపాదించితి మని సంతోషించిరేమో కాని, నిజము వెలువడినప్పుడవాస్తమగునని తెలియరు కాబోలు.

భారతదేశ పుణ్యక్షేత్రము లన్నిటిం గాలినడకను సంచార మొనర్చుపట్ల శ్రీ నరసింహదాసుగారు దక్షిణదేశమున త్యాగరాజను జగద్విఖ్యాత భక్తకవిని క్రీ. శ 1822 సంవత్సరమున దర్శించి యిచ్చుటి విశేషములం దెల్ప నతండును నొకపరి యిచ్చటకు వచ్చి శ్రీరామ సందర్శనానందపరవశుడై "మోహన రామ, ముఖజిత సోమ" యను కీర్తనను మోహనరాగమున బాడి గుమిగూడిన జనంబులను ముగ్ధుల నొనరించెనని నేటికిని జెప్పికొనుచుందురు.

తూము లక్ష్మీనరసింహదాసు, వరదరామదాసుగార్ల లిఖితపటములుగాని ఛాయాప్రతిబింబములుగాని లభ్యము కాజాలక పోవుట శోచనీయము. ఇట వారి స్వల్పజీవితమే

కారణము. ఛాయాగ్రాహక యంత్రరీతులు మారుమూలల నప్పటికి వ్యాపింపలేదు. శ్రీ నృసింహదాసుగారి యీ చరిత్ర మైనను వారి సోదరుని మనుమడు శ్రీ సీతారామదాసుగారు (కొడుకుకొడుకు) ద్విపదలో వ్రాసినదానినిబట్టి తెలిసిన విష యములను, వినుకలిచే వృద్ధజనంబు లెరింగించిన విషయము లను గూర్చి వ్రాసితిని. శ్రీ నరసింహదాసుగారు క్రీ.శ. 1790 లో జన్మించిరని వారు వ్రాసిరి. వరదరామదాసుగారు ములికినాటి వైదిక బ్రాహ్మణు డని వారు వ్రాసిరి. నృసింహ దాసుగారు పరాశర గోత్రజులగు గోలుకొండ వ్యాపారులు. సముద్రపుటుప్పును అడవి యుసిరికయు నొకచో గూడినట్లు లిచట భక్తిభావమున వీ రాత్మీయు లైరి. వరద రామదాసు గారి భార్య శేషమ్మయు దల్లియు వైకుంఠ యాత్రలో బోయిరి. అప్పటి కారుమాసముల కొడుకు గలుగుటచే పోషింపవలసిన దని యాదేశించుటయు పదంపడి నృసింహ దాసుగారి భార్య లక్ష్మీదేవమ్మ యా కుమారునిం బెంప నచిరకాలముననే దివంగతుడగుటయు దటస్థించెను. నృసింహ దాసుగారికి సంతతి లేమి తత్పతీమణి జ్ఞాతిసుతుని రామ దాసును దత్తుగాగొని చాలకాలము జీవించెను. నృసింహ దాసుగారి యనంతరము జండూలాల్ అయిదూళ్లు మాత్రము భార్యాదుల పోషణకై యొసంగెను. ఈ మహాత్ము లిట నిత్యము సంస్మరింపబడుటచే నమరజీవు లైరి. వీరి వంశీయు లును నిచట గలరు.

# శ్రీ రాజా చందూలాలు

హైదరాబాదులోని హైందవకుటుంబములలో మహోన్నత గౌరవభాజనమై, రాజమర్యాదల బేరెన్నికగన్నది శ్రీ చందూలాలు వంశము. ఈ వంశము వారెల్ల నైజాం పరిపాలకుల మన్ననల నొంది మిక్కిలి సన్నిహితసంబంధము కలిగియుండెడివారు. కొలదికాలము క్రిందనే ప్రధానమంత్రి పదవినుండి విరమించి కీర్తిశేషులైన శ్రీ "కిషన్ ప్రసాదు" వీరి దౌహిత్రులు. వీరు దానధర్మముల నీడులేని కీర్తి గన్నవారు, రాజ్యతంత్రజ్ఞులు, విద్యాధికులు, సిరిసంపదలతో తులదూగిన జాగీరుదార్లు. వీరు మార్గమున బోవునపు డిరువైపుల పేదసాదలకు రూకలం బంచిపెట్టుచు యీవిలో నానంద పడుట ఆబాలగోపాల మెఱుంగుదురు.

రెండవ నైజాము నిజామలీఖాన్ (క్రీ. శ. 1763–1803) పరిపాలనమునం దీ శ్రీరామ దేవస్థానమునకు పరగణాకు బదులీయవలసిన మొత్తము నలువదివేలుగ నిర్ణయింపబడె నని ఒక ప్రభుత్వవిచారణాధికారి 1264 ఫసలీ (క్రీ. శ. 1854) లో వివరించి యుదాహరించి యుండెను. శ్రీ నరసింహదాసుగారితో జందూలాలు చర్చించి నిర్ణయించుట రెండవ మార్గముం ద్రొక్కినది. ఇది నాల్గవ నైజాము నాసరుద్దౌలా పరిపాలన కాలమునాటి విషయము (1830 ప్రాంతము). పాలవంచ తాలూకా మొత్తము నొసంగుచు పై నలుబదివేలలో

100 సిపాయీలను ఒకతోపు రక్షణకుగాను నియమించి అందుకు రు. 8000/- సంవత్సరపు వేతనముగాను, ఆఫీసు దర్బారు వ్యయములకు సాలుకు 12500/- రూపాయలున్ను దేవాలయపు ఖర్చులకు రు 18,500– లున్ను నిర్ణయించి రు. 32,000/- ప్రభుత్వమునకు కప్పముగను విధించెను. ఈ విధముగా తాలూకాపై నిర్ణయింపబడిన రు. 71,000/– మొత్తమును వ్యయపెట్టవలసినదని యాజ్ఞాపించెను. శాసనమున నిదే చూడనగును. మరియు నీ దేవస్థానమున కనుబంధముగానున్న నా తాలూకాలోని యితర దేవాలయార్చకుల భృతు లిందే నిరూపించెను. అవి యేవన, నీ గ్రామములోని గోవిందరాజస్వామి, రంగనాయకస్వామి, నృసింహస్వామి యాలయములుగాక (1) ఇచ్చటి కాశీవిశ్వనాథస్వామి ఆలయము, (2) పర్ణశాల శ్రీ సీతారామాలయము, (3) మోతె గడ్డపై వీరభద్రస్వామి, (4) విరివెండిలోని వేణుగోపాల స్వామి, (5) రామానుజవరంలోని గోపాలస్వామి, (6) బయ్యవరంలోని శివాలయము, (7) మల్లూరులోని లక్ష్మీనరసింహ స్వామి, (8) అందలిదే శివాలయము, (9) మంగపేటలోని శివాలయము, (10) నాగుపల్లిలోని లక్ష్మీనారాయణస్వామి, (11) పాలవంచలోని వెంకటేశ్వరస్వామి, (12) దమ్మపేట లోని వేణుగోపాలస్వామి వారి ఆలయములు. ఈ విధముగా శ్రీరామాలయమునకు రు 13400/- అనిన్ని, ఇతరాలయములకు రు 5100/-అనిన్ని స్పష్టీకరించెను. మరియు కల్యాణోత్స

నమునకు తలబ్రాలముత్యములు పట్టుదుకూలములు శాలువలు మొహిరీలు తాను సకాలమున కతి శ్రద్ధాభక్తులతో నంపుచుండెను.

కాని యచిరకాలముననే దాసదర్యయ మస్తమింప నీ దేవళము నిర్వహింపగల సమర్థులు తనకు గన్పట్టనందున చందూలాలు తానే యీ బాధ్యత వహించి యర్చకస్వాములనట బిలుపించుకొని యీ నిర్ణీత ద్రవ్యము రు 18,500/-లకు మాత్రము శ్రీ స్వామివారిపేర సనదు వ్రాయించి యిచ్చెను. రసీదు వ్రాయించి యిచ్చి ఖజానాలో నీ ద్రవ్యము పొందుటకును, యిది పాలవంచ లెక్కలలోనుండి అమలు కావలెననియు నాజ్ఞాపించెను. ప్రతి సంవత్సరము కల్యాణసామగ్రి తానంపుచు, గొనిపోవువారిని మార్గమందు తనిఖీనిమిత్తమై యే యుద్యోగస్తులు నిలుపరాదని వేఱుగా నాజ్ఞాపత్ర మొసగ, దెచ్చుకొనుచు, దేవాలయార్చకస్వాములు దీనిని నిర్వహించిరి. శ్రీ రామచంద్రస్వామి పేర నీ సనదు శ్రీ చందూలాలుచే 1250 హిజ్రీ (1244 ఫసలీకి సరియగు క్రీ. శ. 1835) లో వ్రాయించి యీయబడెను. ఇది ఫారసీ భాషలో గలదు. ఇందు "దర్ ఇవజ్ పర్గణె హసనాబాద్ ఉరుఫ్ పాల్వంచ సర్కారు ఖమ్మంమెట్" అని కలదు. అనగా, ఖమ్మంమెట్టు సర్కారులోని పాల్వంచ యను నామాంతరము గల హసనాబాదు పరగణాకు ప్రతిబద్ధముగా నని యర్థము. కడపట నిది ఆ పరగణా ఆదాయమున జమా

ఖర్చు చేయబడవలెనని కలదు. దీనిం బట్టి యిది వెనుకటి గాథను స్థిరీకరించినదే యీయబడినదని దృష్టాంతర మగు పట్టును. ఈయన వెనుక ప్రభుత్వమువారు 1855 లో నేమి, తరువాత క్రీ. శ. 1908 లో నేమి, యీయబడుచున్న యీ పెద్ద మొత్తమునకు కారణాంతరము లేమని విచారింప, వారి కెల్ల బరిస్థితు లర్థము జేసికొన్నపిదప దానీషా మొదలుకొని నేటివరకు జరిగిన జరిత్రాంశము లొప్పుకొనక తప్పినదికాదు. అందువల్ల ప్రభుత్వ మేటేట యిచ్చు నీ ద్రవ్యమున కంత రాయ మేర్పడినదికాదు.

ఈ విధముగ 'సనదు' నొసంగి దేవస్థానమును బోషించుచున్నను దీని రక్షణసమస్య ప్రభుత్వముపై నున్నందున చందూలా లేదేని యొక సుస్థిరపద్ధతి నేర్పరుప నాలోచించు చుండెను. కాని కొంతకాల మిట్లే జరిగిపోయెను. తరువాత 1275 హిజ్రీ (1268 ఫసలీ 1859 సం॥న) శ్రీరామచంద్ర అశ్వారావు బహద్దరు వారికి శాశ్వతకవులు పద్ధతిపై నీయబడెను. అదియే పాలవంచ సంస్థానపు పునస్సృష్టి. అందు భద్రాచలమునకు నిర్ణయించబడిన మొత్తముపై వారిబాధ్యత స్పష్టీకరింపబడెను. అప్పటికి దమ్మపేటలోని వేణుగోపాల స్వామి దేవాలయమున కొక రు 500/-లు నిర్ణయించబడుటయు మఱొక రు 340/- కలియుటయు దటస్థించెను. అమరావతీ దేవాలయమున కొక వేయి రూప్యము లీయ నేర్పరచెను. ఇంతియేగాక కల్యాణ సామగ్రులు ఒంటెలపైన ఏనుగులపైన

రావలసియుండి యొకొకప్పు డాలస్యమై సకాలమున కందజాల కుండుట గమనింపబడెను. 1845 లో నిది వెలగట్టి రు 125/-గా తేల్చబడి పై మొత్తమునకు జేర్చబడెను. ఈ విధముగా దేవస్థానమునకు నీయదగిన సంవత్సరపు మొత్తం రు.19,465/- నైజాము చలామణీ రూపాయలుగ నిర్ణీతమయ్యెను.

పాలవంచ సంస్థానాధీశ్వరులు తమ సంస్థానములోని యీ మహాక్షేత్రమును మిగుల భక్తిశ్రద్ధలతో బోషించుచూ వచ్చిరి. నిర్ణీత ధనముకన్న నెక్కువ వెచ్చించిరి. అనేక వస్తు వాహనములు సమర్పించి వైభవము నినుమడింపజేసిరి. చాల కాలమువఱకు శ్రీరామచంద్రమహాప్రభువారి ముద్రనే తమ కార్యాలయములం దుపయోగించిరి. కాని కొంత కాలమైన వెనుక సంస్థానోద్యోగులు దేవాలయార్చకసంఘము మధ్య నెట్టి వైషమ్యము లేర్పడెనోగాని ప్రభుత్వమువారి దృష్టికి తేబడినందున ప్రభుత్వమే క్రీ శ. 1870 సం॥లో దీని నిర్వాహణము నందుకొనెను. తదాది పాల్వంచ లెక్కలలో నిది పూర్వోక్త ప్రకారము వ్రాసికొనబడవలసి యున్నను, నిర్ణీత ధనము ద్వాదశభాగములుగా ప్రతిమాసాంతమందు దేవస్థానమున కొసంగుచు హైద్రాబాదు ప్రభుత్వము స్వీయ పర్యవేక్షణములో బూర్వపు మర్యాదలను నిరభ్యంతరముగ కొనసాగించినది.

చారిత్రికముగ జూడ క్రీ. శ. 1766 సం॥లో కంపెనీవారు త్తరసర్కారులను కవులుకు తీసికొని ప్రవేశించి నప్పటి

నుండి కవులు మొత్తముల లెక్క నొసంగుటయే గాని యెన్న డును మరల నీ జిల్లాలను నైజా మధీనము నొసర్చినట్లు కను పించదు. అయినను శ్రీరామాలయ నిర్వహణము మాత్రము నాటినుండి అవిచ్ఛిన్నముగ నిజాం ప్రభుత్వము పరముగనే నడచినది. 1860 సం. డిశంబరు 26 వ తేదీన బ్రిటిష్ ప్రభుత్వమునకును నైజాము వారికిని జరిగిన యొక యొడం బడిక వలన గోదావరి కావల నున్న సర్కారుజిల్లాలు బ్రిటీషువారి కప్పగింపబడినవని తెలియుచున్నది. తరువాత గూడ నీ దేవాలయవిధులు పూర్వపు గౌరవమర్యాదలు వీసర వోవక, హైదరాబాదు ప్రభుత్వమునందే నిలిచి సక్రమముగ నడుపబడినవి. సుమారు 1912 సంవత్సర ప్రాంతమున రక్షణక్రమభారము (పోలీసు బందోబస్తు) మాత్రము బ్రిటీషు వారియందే నడచి హైదరాబాదు సంబంధము నిలిపివేయ బడెను.

## అనంతరభక్తులు - దాతలు

మహాభక్తు లెందరు నిగూఢముగ వెలయుచుందురో గణింప నలవియుండదు. ఐనను కొన్ని కారణాంతరములవలన కొందరి విషయములు బయట పడుచుండును. క్రీ శ 1880 ప్రాంతమున నిచ్చటికి నెల్లూరు ప్రాంతీయులు శ్రీ వెలిదిండ్ల రంగారావుగారు తహశీల్దారుగా వచ్చిరట. స్వామికి రవ్వలు దాపిన వైరముడి సమర్పింప నుద్యమించి సిద్ధము చేయించి రట. కాని నడిమిపచ్చ లభ్యముగాక పని నిలిచిపోయెను.

కల్యాణోత్సవదినము సమీపించెను. దృఢప్రతిజ్ఞుడై యాయన కల్యాణమునకు రాదలచ లేదట. ఇంతలో మదరాసునుండి యొక వేశ్య వచ్చి తన వ్రేలి యుంగరమును దీసి యిది తమ కీయవలసినదని రాజాజ్ఞయైనదని పలికి యీయుగా నందలి పచ్చ వైరముడికి సరిపోయెనట. ఆ వైరముడి స్వామి సన్నిధి నలరారు చున్నది.

ఇట్లే స్వాప్నికదర్శనములు మొదలగు దృష్టాంతములు లెక్కకు మిక్కిలి కలవు. బర్మా పచ్చలహార మనునది, శ్రీ గూడూరు లక్ష్మణరాయ సమర్పిత స్వర్ణపాత్రాదికము లింకె న్నెన్నియో యిట్టి సంఘటనలచే సంపాదితములు. శ్రీ సోమ రాజు పురుషోత్తమదాసుగారు ముక్కోటి యుత్సవాదులకై యొక పెద్దభూదాన మొసర్చిరి. భక్తులచ్చటచ్చట సమర్పించిన భూఖండములు గలవు.

హైదరాబాదులోని జాగీరుదారులగు శ్రీ వరవర నరసింగరావుగారు 1882 సం॥న రాజదర్బారునుబోలిన యొక పెద్ద కట్టడమును 'చిత్రకూటమంటప' మను పేర గట్టించి యొసంగిరి. వెండి వాహనములుగూడ సమర్పించిరి. శ్రీస్వామి వారి చిత్రవిచిత్రాభరణములు, వాహనములు, తానీషా, అక్కన్న, మాదన్న, రామదాసు మొదలగు వారల చిత్రపట ములకు నిది శోభనాలయమై సార్థకనామ మగుచున్నది. వారి మనుమలు శ్రీ నరిసింగరావుగారేటేటా కానుకలు కల్యాణమున కంపుకొనుచుందురు.

శ్రీనిష్కల ప్రకాశదాసు మహిమాన్వితుడై వెలసెనట. ఈయన భక్తికీర్తనలు తఱచు నిట బాడుచుందురు. శ్రీమాన్ గొట్టుపుళ్ళ శ్రీనివాసాచార్యులు పండితప్రకాండులై ముక్తిని కరతలామలక మొనరించుకొన్న వ్యక్తియని నుడువుదురు. శ్రీమాన్ గొట్టుపుళ్ళ సీతారామానుజాచార్యులు శ్రీ స్వామి వారి ముఖ్యార్చకులలో నొకరై తను శేముషీవిశేషముచే నశేషభక్తజనులచే గొనియాడబడి యనేక నిర్మాణ విశేషములం బొందించి యాలయ శోభనాభిలాషియయి, మృదుభాషియై ఖ్యాతిశేషు డయ్యెను.

గుంటూరు మండలమున పెదరావూరు వాస్తవ్యులు రంగావఝుల వెంకటసుబ్బయ్యగారను హరిభక్తశిఖామణి కృష్ణాజిల్లా దివిగోదూరు గ్రామమున శ్రీ రామదాస హరికథాగాన మొనర్చుచు ప్రజోత్పత్తి సం॥ర శ్రావణ శుద్ధైకాదశీ సోమవారమునాడు సప్తాహమంటపమున కథామధ్యమున 'రామప్రభో' యని యాలపించి నిశ్చేష్టుడయి యసువులం బాసిరి.

విశ్వదాతయగు శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు శ్రీ స్వామివారిని దర్శించినంతమాత్రమున నాధునికి యంత్రజ్యోతి లేకుండుట లోపముగా దోప దానిచ్చుటనే యుండి యంత్రపరికరములం దెప్పించి యాలయావరణాంతర మెల్ల విద్యుత్కాంతిమంతం బొనరించి ప్రజోపకార మొనర్చి ధన్యులైరి.

జటప్రోలు సంస్థానపు రాణీగా రిట కేతెంచినప్పుడు నీటి యిక్కట్టులం జూచి యంత్రసహాయమున బావినీరు నడిపించు నేర్పాట్లు బూర్తి జేయించిరి. ఉత్సవదినములలో నుపయుక్తమగు చున్నది.

కర్నూలు వాస్తవ్యులు శ్రీ శ్రీనివాసరావుగారు తమ స్థిరచరాస్తులన్నియు నేరి కేమియు నీయక మరణశాసనమున ప్రభువునకు దఖలుపఱచిరి. వారి భార్యకు దేవస్థానమువారు రు 15/–లు మాసభృతి కారుణ్యమూమరణాంత మొసంగిరి.

7–8 సంవత్సరముల క్రిందట నొక యంధుడు స్వప్నదర్శన ప్రేరితుడై జననీజనకులతో నిటవచ్చి గోదావరిలో మజ్జనమాడి శ్రీ స్వామిదర్శనమున తనకు నేత్రలాభ మొదవినంతనే గ్రామమెల్ల సంతోషముతో దిరుగుట పత్రికాముఖమున నంద ఱెఱింగినదే.

దీర్ఘరోగియగు నొక పోలీసు ఉద్యోగి కుమారుడు స్వామియాజ్ఞ యైనదని యిచటవచ్చి ఒక రేయి నిద్రించినంత ఆరోగ్యవంతుడై తిరిగి యిప్పటికినీ సుఖముగ నున్నాడు.

అసాధ్యరోగపీడితుడై ఒక యుద్యోగి కుటుంబయుక్తముగ వచ్చి రెండు పర్యాయములు రెండు మండలము లిట దీర్ఘప్రసాదముల స్వీకరించి సుఖియై తిరిగివెళ్లి రెండు సంవత్సరము లగుచున్నది.

పర్వతప్రదేశ మగుట జలాభావమున బొలుచు నిచ్చోట పుష్పములు తులసి కొరతలేకుండ జేయ సంకల్పించి శ్రీ చుండూరు వెంకటరెడ్డిగారు (విజయవాడలోని సుప్రసిద్ధ వదాన్యశిరోమణి) స్వామివారి తోటలో నధిక వ్యయముచే బావిని పునరుద్ధరించినారు. అచిరకాలమున నందనవన ప్రారంభము జరుగగలదు. వీరి యభిమాన మీ క్షేత్రము నందు బాయనిదై యుండగలదు.

వెలమ రామదాసను నొకమహాసీయుడు చాలకాలము వఱకిట గొప్ప భక్తుడై నివసించి ఆళ్వారుసన్నిధులు ఆండాళ్ళకో వెలల ప్రతిష్ఠలం జేయించెను. దర్శనసౌలభ్యాతి శయములం బట్టి పలువు రిచ్చోట రామసేవాభిలాషులై కాపుర ముండుచుండుట యనుభవ ప్రసిద్ధము. వేయేల యిచ్చట అర్చకులాది కించిత్సేవకులవరకును అత్యల్ప వేత నము లంగీకరించి శ్రీరామ సేవావిధులలో నుండుట తరతర ములనుండి శ్రీరామ సేవకుల మనిపించుకొను భాగ్యముకొఱకే గాని కేవల ముదరపోషణకొఱకు గాదని తెలిసినవారికి దోపక పోదు. పరిచారకగణ మెల్ల నొక మహాకుటుంబము వలె నిత్యసంతృప్తులై యానంద మనుభవింతురు.

# పర్ణశాల

శ్రీరాముడు స్వయముగా వెలయిచ్చి తెచ్చుకున్న ఈ సర్వాగ్రహారమునకు శ్రీ రామదాసుగారు నిర్వాహక ముద్ర ధరించి భద్రగిరికి విచ్చేయుట దెలిసికొంటిమి. అటుపై నిచ్చటి యుత్సవవిశేషములనెల్ల క్రమబద్ధమొనరించుటే కాక వారు తమ యధికార ప్రాంతమున గల కొన్ని ముఖ్య దేవస్థలములగూడ బెంపొందించిరి. ఒకే విశాల వటవృక్షమున కచ్చటచ్చట దిగిన యూడలవలె భాసిల్లుచు నివి యిచటి మర్యాదలనే యనుకరించు చున్నవి. ఇందు ప్రాధాన్యత వహించినది 'పర్ణశాల' క్షేత్రము.

భద్రాచలమునకు నుత్తరముగ నిరువదిరెండు మైళ్లలో 'పర్ణశాల' కలదు. వర్షాకాలమున గోదావరిలో లాంచీల వలననూ, తక్కిన సమయములందు మోటారు సౌకర్యముల వలననూ, పయనించవచ్చును. పర్ణశాలలో నివసించుటంజేసి కదా శ్రీరాముడు పలుమారు లీ భద్రగిరికి రాగలిగెనని యూహించి, భద్రాచల యాత్రాగతులెల్ల మహిమోన్నతమగు పర్ణశాలకు గూడ తరలి యచటి విశేషముల దర్శించి పులకాంకితు లగుచుందురు.

శ్రీ సీతారామలక్ష్మణుల పర్ణశాలా ప్రవేశ వృత్తాంతము శ్రీ మద్రామాయణము (వాల్మీకము) అరణ్యకాండమున 13-14-15 సర్గలలో జెప్పబడి యున్నది. శ్రీ వాసు

దాసస్వామి వారు (వావిలకొలను సుబ్బారావుగారు) తమ ఆంధ్ర వాల్మీకిరామాయణమున యథానువాద మొనరించిన పద్యముల నే నిచట నుదహరింతును. శ్రీరాముడు తన యరణ్యావాసమున గడపటి వర్షమున దండకాటవి నగస్త్య మహర్షిం గాంచి "మహాత్మా! మే మిక నెటు వెళ్ళవలయు" నని యడిగినప్పుడు, పంచవటికిం బో నొప్పు నని పలుకుచు, నగస్త్యుడు,—

రామా! యయ్యది శ్లాఘనీయము, గదున్ రమ్యంబు, గోదావరీ
శ్రీమన్నిమ్నగ దాపు, పండ్లు సుమనో బృందంబు కొల్లల్, ఖగ
స్తోమంబుల్ మృగముల్ మహాద్భుతము గూర్చున్ నిచ్చ లేకాంత మెం
తే మోదంబు ఘటించు సీత, కిట కెంతే దూరముం గా దనూ!

అని శ్లాఘించెను. వారును, దక్షిణముగ నడచి, జటాయువును సందర్శించిరి. పక్షిరాజు తన వంశక్రమ మెల్ల నుడివి, దశరథునితో తనకుగల మైత్రి నుగ్గడించి, శ్రీ సీతా రాముల నాప్రాంతమం దుండగోరెను. మఱియు, నిట్లనెను—

క. కాంతారము దుర్గము దు
ర్దాంతము రక్షోన్వితంబు రామా! మృగయా
స్వాంతమున మీరు చన నే
కాంతంబుగ నున్న సీత గడిమిం గాంతున్.

శ్రీ సీతారామలక్ష్మణు లాతని ప్రేమకు సంతసించి, కొంతవడి నడచి మనోహరమగు పంచవటీ ప్రదేశమును గన్గొనిరి. శ్రీరాము డి ట్లనెను :

క॥ సురుచిర పుష్పిత తరువై
వర సారస హంస చక్రవాకాన్వితమై

పరమర్షి యనిన గోదా
వరి యిది కడు రమ్యమగుచు వఱలెడి గంటే!'

ఇప్పటికీ పర్ణశాలవద్ద గోదావరి చూడ ముచ్చటగా నుండును. ఇక పరిసరములు :—

సుందర కందరంబులను, సొంపును నింపు రహింప, గేకికా
బృంద మమంద నాదమున నెల్గిడ నల్గడ బూచి కౌచి యా
నందము కందళింపగ ఘనంబులు భూమిరుహంబు లొప్పగా
దందడి పర్వతంబు లివె దవ్వును దాపును గాక యుండెడిన్.

పెక్కుతావుల బైడియు వెండి రాగి
ధాతువులచేత నొప్పు ధాత్రీతలములు
వల్నెల నలంకరించిన వారణముల
చెన్ను వహించుచున్నవో యన్న! కంటె!

అక్కడక్కడ రంగురంగుల నొప్పుచున్న పిల్లగుట్టలు, అలంకరింపబడిన యేనుగుగున్నలవలె నున్నవని శ్రీరాముడు పల్కెను. చూచువారి కది యిప్పటికినీ నిజమే.

గిరులు రహించె నీ తలము గీర్తిమున్ మృగపక్షిలోక సుం
దరమును బుణ్యదంబు నిట దమ్ముడ! పక్షివిభుండు బాసటై
పరగ వసింతమన్న వెస బర్ణకుటీరము సద్విలాసమున్
ఖరకరవంశవర్ధనుడు గట్టె సుమిత్రతనూజు డన్నకై.

స్నేహితుడగు జటాయువు వండగ నుండ, నిచ్చటనే వసింతమని రాముడు పలికినంతనే, లక్ష్మణుండును పర్ణకుటి నిర్మించెను.

నేల బునాది ద్రవ్వి కడు నేటుగ గోడలు వెట్టి, బొంగుకం
బాలను నిల్పి వానిపయి ప్రక్క వెదుళ్ళను బర్చి, జమ్మివా

సాలు గుదిర్చి నారలను జక్క బిగించియు, బోదజెల్లునం
జాలగ గప్పి దిమ్మెసను సారెకు దంచి సపాటుగా మహిన్.
గోదావరికి బోయి గ్రుంకి సత్వరుడయి,
పండ్లు బూవులు దెచ్చి బలియొసర్చి
శాంతి కార్యంబులు సాంతమున్ గావించి
యన్నకు గాన్పించె నాశ్రమంబు.

లక్ష్మణుడు వాసయోగ్యముగ నిర్మించి పర్ణశాలను జూపెట్టగా శ్రీ సీతారాములందు ప్రవేశించిరి. అంత నచిర కాలముననే సీతాపహరణము జరిగెను.

ఈ పర్ణశాల నిర్మింపబడిన స్థలమును, పర్ణశాలనుండి వెలుపలికి వచ్చినప్పటి సీత పాదముల గుర్తులను, యిపుడు జూపెదరు. ఈ ప్రదేశము నలువైపుల గట్టిగోడలచే భద్రము గావింపబడినది. దీని ప్రక్కనే ఆలయము నిర్మింపబడినది. క్రమముగా నొక పల్లె యేర్పడి వృద్ధినొంది 'పర్ణశాల' యను పేరుననే పిలసిల్లుచున్నది.

ఆలయమున శ్రీరామలక్ష్మణుల మూర్తులు భూషణ రహితంబులై, జడలు, నారవస్త్రములతో నలరారుచు, నాటి వనవాస దీక్షారూపములఁ దోపింపజేయుచున్నవి. సీత గొనిపోబడిన దిక్కగుటనో యేమో దేవులు దక్షిణాభిముఖులై కన్పట్టుచున్నారు. సమీపమున గోదావరియు దక్షిణ వాహిని. ఆగమవిధి ననుసరించి క్షేత్రాధిదైవత మేదిక్కును జూచునో, దానిని తూర్పుగా పరిగణింతురు. అది 'దేవప్రాచి'

యనంబడు. పూజాదికములెల్ల నీ నియమానుసారమే ప్రవ ర్తించును. కావున దైవనిరీక్షణ మేవైపున నున్నను ప్రత్యే వాయము లేదు. ఇచట రాముని శోకరాము డందురు. శోక నివారకుడగుట నట్లు ప్రసిద్ధమైనది. ఆర్తు లీ రాముని బూజించి తమ యార్తిం బాపుకొందురు. సీతాపహరణము సూచించుటకు గాబోలు నిట సీతావిగ్రహము వేరుగ జాల చిన్నదిగ నున్నది.

ఈ ప్రదేశమునకు దాపుననే శ్రీ సీతారాముల జల విహార స్థలము కలదు. గోదావరిలో నీరు బురదగ నుండినపు డిచట స్నానమాడుచుండెడివారట. వారు కూరుచుండిన పెద్ద శిలాస్థలములు మంచి యాసనములుగ శోభిల్లుచు నింపుగ నున్నవి. క్రిందనే నీరు లోతుగ నుండి యొక మడుగువలె నుండును. శ్రీ రామాయణమున నీ మడుగు పద్మసరస్సుగ నభివర్ణింపబడినది. దీనిం గని శ్రీరాముడు,—

'అదిగో ఆదిత్యసంకాశమైన సురభి
గంధి పద్మాళి గొమరయి బంధురముగ
బద్మసేవితమైనట్టి పద్మసరసి
దాపునం దున్న యది సుమిత్రాతనూజ !'

అని లక్ష్మణునితో పర్ణశాలకు నిర్దిష్టమైన స్థలమును వర్ణిం చుచు బలికెను. రామాయణ కాలమునాటి పంపాసరస్సు నేడు తుంగభద్రయై ప్రవహించినట్లు, ఈ పద్మసరస్సు ఒక వాగుగ బాఱుచు గోదావరిం గలియుచు 'సీతవాగు' అని

చెప్పబడుచున్నది. ఈ స్నానఘట్టపు టొడ్డుననే విశాలము లగు చాపుబండలు గలవు. ఇవి విచిత్రమగు గావిరంగు లతో జూచువారికి చీర లారవేసినట్లు గన్పించును. అందుచే నివి 'సీతామ్మవారి చీర' లందురు. ఇచటనే శ్రీ చూర్ణము, పసుపు, కుంకుమరాళ్లు కలవు. చిన్నచిన్న రాళ్లు వ్రేళ్ళతో మెదిపినంతనే చూర్ణమై ఆయా రంగుల నెసంగును. ఈచోటు దప్పించిన అట్టివి ఆ వాగుననే యిక లభింపవు. యాత్రికు లివి మూటగట్టుకొని పోవుచుందురు. శ్రీరాము డిట బహు విధ వృక్షజాతు లున్నట్లు వర్ణించెను. ఇప్ప, మద్ది వృక్షము లెక్కువగ నిప్పుడు కలవు. సీతవాగు నొడ్డున గల మద్దిచె ట్టొకటి చుప్పనాతి సమీపించిన వృక్షమట. దీనిపై రాళ్లు రువ్వుదురు. ఇట్టి రాళ్లు గుట్టవలె పడియున్నవి.

పరిసరారణ్యమున విరివిగ నున్న జింకలు, లేళ్ళు నీ సమీపమున నొకటియు గానరాకుండుట మహర్షుల శాప ఫలిత మని జెప్పుకొందురు.

పర్ణశాల కెదురుగ గోదావరి యావలియొడ్డున 'రథపు గుట్ట' కలదు. దీనిపై రథమునునిలిపి రావణు డిటు లంఘించి పర్ణశాలకు వచ్చె నందురు. ఈ గుట్టపై ఏటవాలుగ నొక మార్గమున రథము నడిపింపబడినట్లు చారలు గన్పించుచు దూరమునుండి భక్తులకు దర్శనీయములుగ నున్నది. పర్ణ శాలకు నాలుగుమైళ్ళలో 'దుమ్ముగూడె' మను గ్రామము కలదు. శ్రీరాముడు ఖరాదులగు పదునాల్గువేల రక్కసుల

నొక్కడే యుక్కడిగించుట ఇక్కడనే జరిగెననియు, యుద్ధపు దుమ్మున గట్టబడినదగుటచే దుమ్ముగూడె మయ్యెననియు జనవాక్యము కలదు. కొంచెము దూరముగ 'లక్ష్మణగుట్ట' యున్నది. ఇందు సీత నుంచి, లక్ష్మణుడు జాగరూకత వహించి యుద్ధమును గనజేసెనట. శ్రీ సుదాసస్వామివారు ధూము గూడెము దుమ్ముగూడె మయ్యెననియు, జటాయువును శ్రీరాముడు సంస్కార మొనరించిన స్థలమయి యుండవచ్చు ననియు 'మందరము'న వ్రాసిరి. ఈ ప్రదేశమునకు మఱికొంత దక్షిణమున 'జటాయుగుట్ట' కలదు. జటాయువు నివసించు పాక 'జటాయుపాక' యే 'ఎటపాక' యను పేరు నొంది గ్రామ మయ్యెనని యానుపూర్విగ ప్రసిద్ధమైయున్నది.

రామాయణమునాటి పంచవటి 'నాసిక' వద్దనే కల దని శ్రీ నవీనచంద్రదాసు ఎం. ఏ., గారు వ్రాసిన దానిని విపులముగ విమర్శించి శ్రీ వాసుదాస స్వామివారు తమ యారణ్యకాండ 'మందరము' వ్యాఖ్యానమున ఖండించిరి. వాల్మీకి మహర్షి శ్రీరాముడు 'తపతీ', 'నర్మదా' నదులను గాని, వింధ్యపర్వతములనుగాని దాటినట్లు వ్రాయకపోవుటచే 'నాసిక' వాదము నిరాధార మగుచున్నదనియు, రామా యణమునందలి వర్ణనములంబట్టి గోదావరి యిట దక్షిణముగ ప్రవహించుటయు, సీతారామాదు లయోధ్యకు విమాన యానమున జనినప్పుడు చూపబడుట కిది యనువుగ నుండు టయు నుదహరించి పర్ణశాల యిచ్చటిదే యని నిరూపించిరి. అయితే, గోదావరి నిచ్చట దాటినట్లు లందు జెప్పబడ

కుండుటచే, 'రథపుగుట్ట' సమీపమున నావలి యొడ్డుననే పంచవటి యుండవచ్చుననియు, సమీపమున పెద్ద కొల నుండుటయు వారందు చేర్చొనిరి. గోదావరి యొడ్డు కోసికొని రాగారాగా నచటివారీవైపు రాగలుగుటయు నూహ్యమే. ఇప్పటికిగూడ నీయూరింకను గోదావరికోతకు పాలగు చున్నది.

## స్థల విశేషములు

క్షేత్రాధిదైవతము నించుక ప్రశంసించి స్థలవిశేషముల విమ్మట నెఱింగించెదను. సత్యనిరతి, పితృవాక్యపాలనము, ఏకపత్నీవ్రతము, భయత్రాణము, భూతదయ, సజ్జనమైత్రి, సర్వమానవ సౌభ్రాతృత్వము మొదలుగాగల విశ్వజనీన గుణముల నిక్కచ్చిగా ననుష్ఠింపగలిగిన మానవుడు దేవుని వలె బూజింపబడు ననుటకు శ్రీరామచంద్రుడే ప్రథమ నిద ర్శనము. అయిన రాముడన్ననో, నరరూప నారాయణుడు. మానవశాస్త్రజ్ఞు లాదర్శపురుషునిగ గొనియాడినను, మానవా తీతుడగు పరబ్రహ్మస్వరూపుడు శ్రీరాముడు. ఋక్సామ వేదములలో నతనిందెలుపు ఋక్కులు గలవు. వేదమూర్తి యగు భగవానుడే భూమి నవతరింప, వేదములు రామాయణ ముగ బ్రవర్తిల్లినవి. సూర్యవంశమున నవతరింపగల పరమా త్ముని భజించుటకై వసిష్ఠు డిక్ష్వాకుల కంకిత మొనర్చుకొనెను. యజ్ఞరక్షణము నెపమున శ్రీరామలక్ష్మణుల వెంతజేర్చుకొని ధనుర్వేదాచార్యుడై విశ్వామిత్రుడు లోకకల్యాణకరులకు

కల్యాణసంధాయకుడై చరితార్థు డయ్యెను. పరశురాముడు విష్ణుతేజమును సమర్పించుకొనెను. అగస్త్యుడు విష్ణుదేవతాకములగు చాపఖడ్గాదు లొసంగి కృతార్థుడనైతి ననెను. శ్రీరామదర్శనమున కంగలార్చుచుకొని యుండి శరభంగాది తపోధనులు దండకారణ్యమున వసించి, దర్శించి ధన్యులైరి. అనసూయ నసిచెడని యంగరాగముల సీతమ్మ కొసంగెను. రామకార్యార్థులకు స్వయంప్రభ మహోపకార మొనరించెను. శబరి యాతిథ్య మిచ్చి దేవు నారాధించెను. బ్రహ్మవరమున సత్యవాణీ విలసితుడై వాల్మీకిమహర్షి రామాయణ రచన సాగింప విశ్వామిత్రాగస్త్యాది ఋషు లెల్లరు దలకొక రామగాథం జిత్రించి లోకోపకార మొనరించిరి. పరబ్రహ్మ తత్త్వవేత్తయగు పరమశివు డంబికకు రామతత్త్వము నుపదేశించెను. శివసామ్యులగు శంకరులు ప్రజలకు గర్ణామృతముగ శ్రీరామతత్త్వమును వేనోళ్ళ నుగ్గడించిరి. తేజోనిధులు, జ్ఞాననిధులు, ననాదిగ నర్చించి సన్నుతించి సేవించి జపించి ముక్తులగుటకుం బ్రోవలు దీర్చుటంజేసి శ్రీరాముడు భారతీయుల చిత్తముల నొత్తుగ హత్తుకొని యున్నాడు. నలువది కోట్ల భారతీయులా రామరాజ్యమునకై కదా నడుములు కట్టుకొని యహరహము శ్రమించుచున్నారు. మేధావు లీ బృహత్కథను భాషాంతరముల దేశాంతర ఖండాంతరములందుగూడ వ్యాప్తినొందించి జగత్కథగ జేయుచున్నారు. కలముబట్టిన ప్రతి నేర్పరియు నినకులతిలకుని నులికించకపోలేదు.

హరిహర మంత్రములనుండి మూలి కాక్షరముల గ్రహించి జతపఱచి వశిష్ఠుడు రామనామమును సృష్టించెను. రామ శబ్దము సప్తసంఖ్యా సాంజ్ఞికము (2+5). ఆర్ష సంప్రదాయ మున సప్తసంఖ్య కొకవిశిష్టస్థాన మున్నది. సప్తమ(వైవస్వత) మన్వంతరమున శ్రీ మహావిష్ణువు తన సప్తమావతారమున శ్రీరాముడై సప్తవర్ణ కరుడగు సప్తాశ్వుని (సూర్య) వంశమున సప్తమ నక్షత్రము (పునర్వసు) న జన్మించెను. (పంచమ త్రేతాయుగమున చతుర్థపాదమున ముప్పది వేలగుచుండ విళంబిసంవత్సర చైత్రశుక్లనవమీ బుధవారం పునర్వసున శ్రీరామజననము) రవ్యాది సప్తగ్రహముల పేరులం బఱగు దినములతో కాలచక్రము నిర్విరామముగ దిరుగుచున్నది. సప్తజిహ్వుని (అగ్ని) చే సన్నుతింప బడిన సీతను, సప్తతాళ భంజనమున మహావీరుడుగ నెఱుంగబడిన శ్రీరాముని గీర్తించు శ్రీమద్రామాయణము సప్తకాండాత్మకము. సప్తమహా వీరులు (రామ లక్ష్మణ సుగ్రీవ హనుమంత విభీషణ రావణ కుంభకర్ణులు) సప్తదివసములు యుద్ధమొనరించిరి. శ్రీమద్రా మాయణ సుందరకాండమును సప్తసర్గపారాయణ మొనరిం చుట నిహపరసాధకముగ నెన్నబడుచున్నది. శ్రీరాముడు వనవాసాంతరమున ధాతు సంవత్సర చైత్ర శుద్ధ సప్తమిని పట్టాభిషిక్తుడయ్యెను. ఇంకనూ సప్తఋషులు, సప్తకులపర్వ తములు, సప్త ద్వీపములు, సప్త సముద్రములు, సప్త ఊర్ధ్వ లోకములు, సప్త అధోలోకములు, సప్త పుణ్యనదులు, సప్త పుణ్యనగరములు, సప్తచిరంజీవులు, సప్త మేఘములు, సప్త

మండలములు, సప్త సంతానములు, సప్త జన్మలు, సప్త ధాతువులు, సప్త సభాంగలక్షణములు, సప్త రాజ్యాంగములు, సప్తవ్యాహృతులు, సప్త ఆవరణలు, సప్త జ్ఞానభూమికలు, సప్తమూయావస్థలు, సప్తచైతన్యములు, సప్తప్రాణాయామములు, సప్తస్వభావములు, సప్తవ్యసనములు, సప్తస్వరములు, సప్తశ్రుతులు, సప్తతాళములు నిటు లెన్నియున్నవో పెద్దలకే యెఱుక! గీర్వాణాంధ్రభాషలు సప్త విభక్తుల నొప్పారుచున్నవి. అనంతమహిమాస్పదమైన నీ రామనామము తారకనామమై నిరంతరము పల్లీపక్కణవీధుల గాన, మనన, స్మరణ, లేఖన, జప, సంకీర్తనాది గరిష్ఠతల నొంది వరిష్ఠ మగుచున్నది.

శ్రీరాముడు నారాయణస్వరూపుడై వెలయుట భద్రాచలమున దప్ప మఱొకచోట లేదని చెప్పుదురు. ఇచట బశ్చిమాభిముఖులై వేంచేసియున్నారు. గోదానదియెదుటనే దక్షిణవాహినియై యనతిదూరమున దూర్పుకు మరలుచున్నది. ఆలయమున మంగళగీతికా సముచిత ప్రబోధోత్సవమున, నుషఃకాలమున మేలుకొలిపి ఉత్సవక్రమముల నారాధింతురు. రాత్రి శయనోత్సవమువఱ కిట్టివి దశవిధారాధనోత్సవములు జరుగును. అనంతరము దేవతలం గాపువెట్టి సందడిసేయ వలదని హెచ్చరించి మఱలుదురు. ఇక ప్రవేశమున కెవరికినీ అనుమతి లభింపదు. ఉదయమున జరుగు స్నపనోత్సవమును పలువు రానందించుటయేకాక భక్తులు తమపక్షమున జరిపించుకొందురు. దీనినే అభిషేకోత్సవ మందురు. గండకీ

నదినుండి శ్రీరామదాసుగారు సాలగ్రామములను గొనివచ్చి రెండు హారములుగ సంతరించిరి. ఇవి శ్రీరామ లక్ష్మణుల కలంకరించి అభిషేక మొనరింతురు. నిశాముఖమున జరిపింప బడు ప్రభుత్వోత్సవము (దర్బారుసేవ) ను, చివరి పర్యంకో త్సవమును నీ యాలయ ప్రత్యేకతలు. ప్రతి శుక్రవారమున ప్రభుత్వోత్సవముతో బాటు శృంగార సేవ (బంతులాట) జరుపుదురు. పలువురు స్త్రీలీ సేవం దిలకింప వత్తురు. ఏకాదశి పూర్ణిమా పునర్వసులందు బురసేవలును, ద్వాదశీ అమా వాస్య సంక్రమణములందు కోవెలచుట్టు సేవలును జరుగును.

ఇట్టి పురసేవలలో నుత్సవమూర్తులు ముప్పురను జలువచప్పరమను నొక సులభ వాహనమున నలంకరించి తిరువీధి నూరేగింతురు. శంఖచక్ర ఛత్రచామర భేరీమృదంగ పటహ కాహళాది బహుముఖ మంగళ వాద్యములతో డను, వందిమాగధ సంస్తవములతోడను, భూసుర స్వస్తి వాచక పురస్సరముగ నుత్సవ మాలయములనుండి బయలు వెడలి కించిద్దూరమున గల విశ్రాంతి మంటపముం బ్రవేశిం చును. ఇట చక్రవర్తితనూజు డలసి విశ్రమించుట భావింప బడును. క్రమ్మఱ బయలుదేఱి వీధిచివర గల గోవిందరాజ స్వామి దేవాలయము బ్రవేశించును. శ్రీరాముడు తన కాల మున గోవిందరాజస్వామిని గొలుచుటం జేసి యీ దేవుని తాతగారనియు, ప్రజలాకోవెలను తాతగారికోవెల యనియు నందురు. ఈ రెండుస్థలములందును ఆలయమున దర్శింపజా లని ప్రజలకు ప్రత్యేకముగ శ్రీరామదర్శన ప్రసాదములు లభించు

చున్నవి. మఱలి యాలయమునకు జనునప్పుడు రయమున బోవుటయు భద్రుని కెడమగుట నప్పటికే జాగయ్యెననియు దలంప బడుచున్నది.

గరుడ, హనుమంత, గజ, అశ్వ, సింహ, హంసవాహనములు పురసేవకు వెడలునపు డొక యాచారము కలదు. ఇం దొకటి వెడలునపుడు శ్రీరాము డొకడే యధిరోహింప సకల పరిధవము లనుసరించుయు, సీతాలక్ష్మణు లొక సామాన్య వాహనమున నుపవిష్టులై భక్తులసేవ లందికొని మునుముందుగ నడచుటయు గన్పట్టును. దండకాటవిని లక్ష్మణుడు ముందుగ దారి సూప, సీతయు నా వెనుక రాముడును చరించుట స్మృతిపథము నంటును. వీరిని దర్శించు నపుడు తన్మధ్యముగా వెనుకనున్న రామదర్శనమును వెను వెంట నగుచుండును. కానుక సమర్పణములు ముగియును గనుక వాహనస్థిత శ్రీరాముని తడవు దర్శించి స్మరింప నను వగుచున్నది. సార్వభౌమ పరిధవోపేతుడగు రాముని పజ్జనుండ నొల్లక జానకి భక్తసులభయై ముందు గదలుచున్నదనియు భక్తులు చమత్కరింతురు.

ప్రతి సంవత్సరమును చైత్రమందలి తొలిపక్షమెల్ల శ్రీరామ కల్యాణమహోత్సవముగ పరిఢవిల్లుచున్నది. అను దినమును రాత్రులందు వివిధ వాహనాలంకారములతోడ తిరువీధిసేవలు గలుగును. పాడ్యమినాడు పంచాంగ శ్రవణము జరుపంబడును. శుద్ధ సప్తమి దివసమున శ్రీ సీతారాముల నవాహ్నిక కల్యాణోత్సవమున కంకురారోపణ జరుగును.

మరునాడు ధ్వజారోహణము, నవమినాటి మధ్యాహ్నమున కళ్యాణ మహము ప్రత్యేక మంటపమున నశేషజనసమూహములు జూడ ముచ్చటగ శోభిల్లుచుండును. అసంఖ్యాకముగ వచ్చు తైర్థిక కోటికి నది కిరువైపులను వసతులకు బసలు, పందిళ్ళు, మంచినీటిసౌకర్యములు, విద్యుద్దీప్తియు సమకూర్చబడును. శ్రీరామనవమి నాటి ఉదయమునకే కళ్యాణమంటపము జనసందోహముచే క్రిక్కిరిసి యుండును. అభిజిన్ముహూర్తమున తలంబ్రాలు వోయుటతో నాటి యుత్సవ మచ్చట ముగియును. శ్రీరాము డీ నవమినాడే జననమొందినను, శ్రీరామోత్సవవిధినియమము ననుసరించి రామునికి జననమునాడే కల్యాణోత్సవము విధింపబడినది. అనంతర దినములందు రథోత్సవము, డోలోత్సవము, తెప్ప ఉత్సవము, దోపు ఉత్సవము, ధ్వజావతరణము, నాకబలి, పుష్పయాగోత్సవము, చక్రతీర్థము మున్నగునవి పాంచరాత్రాగమసరణి ప్రవర్తిలును.

వైశాఖమున బునర్వసూ నక్షత్రమున చక్రవర్తి తిరుమఘనార్ (శ్రీరాముని) తిరునక్షత్రము, అందే యొక శుభముహూర్తమున బునస్సంధానముజరిగి చైత్రమున నిలిపి వేయబడిన పర్యంకోత్సవ మారంభింపబడును. శుద్ధనవమికి సీతా జయంతి జరుపబడును. ఈ పూర్ణిమకు పంచాహ్నిక విధానమున నెదుట గుట్టపైనున్న నరసింహస్వామికి గల్యాణోత్సవము జరుగును.

జ్యేష్ఠ పూర్ణిమకు జ్యేష్ఠాభిషేకోత్సవము నొనరింతురు. ఆషాఢ పూర్ణిమకు గోవిందరాజస్వామి కల్యాణోత్సవము జరుపుదురు.

శ్రావణ పూర్ణిమకు ముందు శుక్రవారమున లక్ష్మీపూజ జరుగును. స్త్రీలు విశేషముగ పాల్గొందురు. ఆరాత్రి యుత్సవమున దర్శనాగతస్త్రీలకు సీతాదేవి పసుపుకుంకుమ వస్త్రాదికము లొసంగును. ఈ పూర్ణిమ అంతముగా పంచాహ్నిక పవిత్రోత్సవము విధివిధానముగ జరుపంబడును. బహుళాష్టమీ రాత్రి శ్రీకృష్ణజన్మోత్సవము సమాచరింపబడును. మరునాడు గోపాలసేవ జరుగును. దీనినే 'ఉట్లసేవ' యందురు. స్వామిసన్నిధిని ప్రత్యేకమంటపమున గోపాలురు ఉట్లు గొట్టుదురు. కించిద్దూరమునుండి బాలబాలికలు పంచరంగుల చిలుకలవలె యలంకరించుకొని సముత్సాహమున జిమ్మిడి గొట్టములతో జిటపటధ్వనులతో రంగునీరుగొట్టుచు వినోదింతురు. పురములందుగూడ నిర్దిష్టస్థలముల నిట్లేజరుగును.

ఆశ్వయుజమున దొలిపాడ్యమినుండి శరన్నవ రాత్రోత్సవములు లక్ష్మీపూజలు వైభవముగ జరుగును. మహానవమినాడిది విశేషముగ జరుగును. విజయదశమినాటి సాయంతనమున శమీపూజ పారువేట జరిపింపబడును. నరక చతుర్దశి చంద్రోదయవేళ మంగళస్నపనోత్సవము. నాటి రాత్రి యందు వీథులలో నవనవాలంకృత దీపపంక్తు లుజ్వలములగుచుండ, వివిధ రవరవకారములతో బాణసంచాలు ప్రేల్చబడుచుండ పల్లకీసేవ జరుగును.

కార్తిక శుద్ధ ద్వాదశి క్షీరాబ్ధి మథనద్వాదశి. నాటి రేయి శ్రీరామచంద్రుడు జగన్మోహినిగ నవతరించి, దేవాసురుల కమృతముపంచు విధాన మవలంబింపబడును. దూర దూరములనుండి భక్తులీ క్షీరముల గ్రోలుటకును, నద్వితీయ శోభనాలంకృత గరుడవాహనారూఢుం డగు పరంధాముని జగన్మోహిన్యవతార దర్శనమునకును బఱతెంతురు. కృత్తికతో బఱగునేని యీ పూర్ణిమకు కృత్తికా దీపోత్సవ మేకాహ్నికముగ నాచరింతురు. గరుడవాహనాలంకారమున పురసేవ జరుగును. దీపాలంకార విశేషము లొప్పును. కృత్తిక రానిచో మరుచటి మాసమున జరిగింతురు.

మార్గశిర పుష్యమాసములం దెందు ధనుర్మాసము సంక్రమించునో ధనుర్మాసోత్సవములు ఆండాళ్లు సేవలు జరుగును. అందలి శుద్ధైకాదశి వైకుంఠైకాదశి. తొలి పదిరోజులు దినక్రమమున దశావతారాలంకృతు లొప్పుచుండ అవతార విశేషకథనములు, కవిగాయక హరిగాన విశారదుల ఆడంబరములతో, బహుళోత్సాహముతో నాలయమెల్ల వెల్లివిరియును. శ్రీరామనవమి పిదప నిదియే రెండవ మహోల్లాసోత్సవ కాలము. నదీమార్గమున ననేక రామకోటి సమాజములేతెంచి యుత్సవముల కానందము సంఘటించును. ఏకాదశి మొదలు రాపత్తు ఉత్సవములు పదిదినములవఱకు పురమున పలుప్రాంతములలో భక్తుల కోరికలపై జరుపంబడును. వైకుంఠైకాదశినా డుషఃకాలమున గరుడవాహనారూఢుం

డగు పరంధాముని ద్వారదర్శన మైనపిదప నయిదు వాహన
ములతో గిరి ప్రదక్షిణముగ గొప్ప యుత్సవము జరుగును.
ఆవల మకరసంక్రమణమునకు తొలిదినమున గోదాకల్యాణ
మును, సంక్రాంతినాడు రథోత్సవమును జరుగుటయు,
నమ్మవారు ద్వారనిరోధ మాచరించుటయు, సమాధాన
పడుటయు బ్రహర్షింప బడును. మాఘమాసమున శుద్ధ
సప్తమి రథసప్తమికి పల్లకి సేవయు, పూర్ణిమకు త్రయా
హ్నికముగ సహస్రకలశాభిషేకోత్సవములు జరుగును.

శ్రీరామాలయమున ప్రక్కనే రాజవీధి కావలవై
పున శ్రీ కాశీవిశ్వనాథుని పేర నొక శివాలయము కలదు.
రామదాసుగారు ప్రతిష్ఠించినట్లు జెప్పుదురు. రామలింగే
శ్వరుని యభిషేకతీర్థము కానరాకుండ గోదావరిలో గలి
యును. శివరాత్రికి కళ్యాణోత్సవము జరుగును. దీనికిపైన
గుట్టపై శ్రీరంగనాథస్వామి ఆలయ మున్నది. మాఘపూర్ణి
మకు పంచాహ్నిక కల్యాణోత్సవ మచ్చట జరుగును.

ఫాల్గున పూర్ణిమకు శ్రీరామునికి వసంతోత్సవము
విశేషవైభవముగ జరిపింపబడును. ఇది ఏకాహ్నికముగ జరు
గును. శ్రీరాముడీ దినమున పెండ్లికొడుకగుచుండును. ఈరేయి
మొద లాలయమున నుండక దూరప్రాంతములకు దనపెండ్లికి
రావలెనని భక్తుల నాహ్వానించుటకు వెడలునట. ప్రాణాచా
రముల బడి నిద్రించువారికి స్వప్నముల లక్ష్మణుడట్లు జెప్పె
నట! నేటికిని నట్లే తలంచి ఆపటు మెవరును ప్రాణాచారవిధి
నాచరింపరు. ప్రత్యేకమంటపమున డోలాధిరోహణ మొన

రించి ఉత్సవమూర్తులకు పెండిలియలంకారము లొనరింతురు. అసలు శ్రీ సీతారాములకు వివాహము జరిగినది సౌమ్యసంవత్సర ఉత్తర ఫల్గుణీయుక్త (ఫాల్గుణ) పౌర్ణమినాడే.

ఎత్తిపడవైచినట్లు మారుమూలగ నున్న నిచ్చోట శ్రీరామనవమి దక్క దక్కిన యుత్సవములు తెలుంగు జనానీక మెఱుంగదు. పలువు రిట్లు కోరినందున నింతవట్టు దెలుపవలసి వచ్చినది. శాస్త్రము లెట్లున్నను ఆగమవేత్తల సంప్రదించి తొలుత శ్రీరామదాసుగారు నెలకొల్పిన యుత్సవ విధానములను తూచా తప్పకుండ ననుష్ఠించుట అర్చకులకును, అనుష్ఠింపజేయుట పాలకవర్గమునకును, విహితమై యొప్పుచు నవిచ్ఛిన్నముగ నాచరింపబడుచున్నవి. చైత్రశుద్ధ మందలి యుత్సవములే ఇచ్చటి బ్రహ్మోత్సవములు.

ఆలయమును ప్రదక్షిణించి వచ్చునపుడు వెనుకనే భద్రుని కోవెలయు మంటపమును రామదాస నిర్మితములు కలవు. భద్రుని స్థానమగుట భక్తులు తొలుత దీనిం దర్శింతురు. అభిముఖముగ శాసనస్తంభములు గలవు. ఆలయ సంస్కృత పండితుడిచ్చో నిత్యము పురాణగోష్ఠి నడుపును. దీని వెనుకనే క్రిందుగ నొక రామానుజకూటము గలదు. 'సీతారామ నిరతాన్నదాన సత్రి' మను పేర భక్తుల ద్రవ్యదానములచే నిట నిరంతర మన్నదానము జరుగుచున్నది. కార్యవర్గమును, లెక్కల తనిఖీలును కలవు. ఆలయముచుట్టు నించుమించు ముప్పది చిన్న దేవళములు విలసిల్లుచున్నవి. లక్ష్మీసన్నిధి యనంబడు తాయారు కోవెల, మంటపములు ప్రసిద్ధములు.

పవిత్రోత్సవమంటప మొక భక్తునిచే యిటీవల సరిక్రొత్తగ పునర్నిర్మింప బడినది.

స్థలాంతరమున శ్రీ పమిడిగంటము వెంకటరమణ హరిదాసుగారు నెలకొల్పిన నిరతాన్నదాన సత్రము కలదు. వీ రంబాకృపావిష్టులు. శ్రీ తూము నృసింహదాసుగారి తర్వాత నింతటి మహనీయుడు మరల జన్మింపలేదు. కల్యాణోత్సవమున నజ్ఞాతవ్యక్తు లిరువు రేతెంచి భూరిపాక మొనరించి యదృశ్యులగుట నెందఱో యెఱుంగుదురు. అమానుష శక్తికిగాని స్వాధీన పడని యీ బలువగు వంటపాత్ర లిప్పుడు కలవు. గణపతి నవరాత్రములలో అన్నదానములు భక్తులచే సాగింప బడుచున్నవి.

శ్రీ దేవీభక్తసమాజ మను పేర పట్టణవైశ్యులు కొందఱొకచోట శరన్నవరాత్రములలో దేవీపూజ లత్యంత భక్త్యుత్సాహములతో వైభవముగ జరుపుదురు. విశ్వబ్రాహ్మణ సంఘము వారిటీవల నిర్మించిన 'ఈశ్వరి' ఆలయమున గూడ నిట్టివి జరుగును. ఇవిగాక శ్రీమందిర మను కుసుమ హరనాథాలయము, శ్రీ సుబ్రహ్మణేశ్వరస్వామి, ఆంజనేయస్వామి, సత్యనారాయణస్వామి ఆలయములు నిచ్చట శోభిల్లుచున్నవి.

నదియొడ్డున కన్యకాపరమేశ్వరీ ధర్మసత్రము గుంటూరు వర్తక సంఘము వారు నిర్మించినది కలదు. యాత్రికులకు బసలకు వసతిగ నుండును. దేవస్థాన సత్రము, మరియొండు రెండు చిన్న వసతికూటములు నిట గలవు.

భద్రాచలమున కనుబంధ దేవాలయములలో పర్ణ శాల తరువాత ముఖ్యస్థలములు, 1. మోతే వీరభద్రస్వామి 2. మల్లూరు లక్ష్మీనరసింహస్వామి ఆలయములు. ఉత్తరముగ నిచటికి మూడుమైళ్ళలో గోదావరీమధ్యమున నొక యెత్తైన గడ్డపై వీరభద్రస్వామి కోవెల యున్నది మోతే గ్రామమున నుండుటచే నిది మోతెగడ్డ యనంబడును. నదిలో వరద నీరెంతవచ్చినను ఆలయపుమెట్టు నంటదు. ఇది అగస్త్యఋషి ప్రతిష్ఠితమని చెప్పబడును. శివరాత్రికి పెద్ద యుత్సవము జరుగును. ఆటవికు లెక్కువ బాల్గొని మ్రొక్కుబడులు చెల్లింతురు. దీని కింకను నేబదిమైళ్ళుత్తరమున నది కావలనైపున మల్లూరుగ్రామ సమీపమున నొక గుట్టపై లక్ష్మీనరసింహ స్వామి ఆలయముకలదు. ఈ గుట్టను హేమాద్రి యందురు. ఆలయమున్న ప్రదేశమున నొకలోయ విశాలమై అడవి మామిడి మొదలగు చెట్లచే మిక్కిలి రమణీయముగను ప్రశాంతముగను శోభిల్లును యాత్రికు లుత్సవసమయమున నుండుట కనువుగ నుండును. వైశాఖపూర్ణిమకు పదిరోజు లిచట కల్యాణోత్సవము జరుపంబడును. ఇచ్చటి బంగారు నగలు తాలూకా ముఖ్యపట్టణమున భద్రపరుపంబడి యుండును. సమయమునకు దగినవారు కొనితెచ్చి యుత్సవ మున నుపయోగింప జేయింతురు. కోవెల చాల పురాతన మైనది. ప్రతాపరుద్రుని కాలమునాటిదని చెప్పబడుచున్నది. ఈ లోయలో గుట్టలనుండి యదృశ్యముగ ప్రవహించుచు నొకటిరెండు చోటులమాత్రము ధారగా పడుచు "చింతా

మణి" యని బిలువంబడు ధారాపాతమే ప్రజలకు జలాధారము. వైశాఖపు టెండకాలమున నియ్యది శరదృతువువలె చల్లదనము గలిగి జనుల కానందము గలిగించును. ఇచట దేనెపెఱ లెక్కువగ నుండును. మధు మక్షికములు నిరంతరాయముగ ప్రవర్తిల్లుచుండును గాని యపరాధములు మాత్రము సైపవు. అవినీతి, అనాచారము, మద్యసేవనము, చింతామణిజలమును నంటువారు దాకుట మొదలగు దుష్ప్రవర్తన మేదేని గనుపించిన జల మంతర్థాన మగుటయేగాక తేనెటీగలు ప్రకోపించి యపరాధుల తుదముట్టించుట గలదు. అందుచే భద్రముగ జాగ్రతగలిగి యుందురు. హెచ్చరికలు చేయబడుచుండును. స్వామికి శాంతివిశేషములు గుడపానీయము లొసంగుదురు. ఇచ్చట స్వామివారి మూలవిగ్రహము ఆరడుగుల యెత్తున ఆకర్షణముగ నుండును. అడవినుండి వెడలి మల్లూరు గ్రామమున పురసేవ జరుపుకొని వచ్చుట యుత్సవదినములందు జరుగును. ఇచటి గుట్టలపై నింకను రమణీయ ప్రదేశములు, బౌద్ధ జైనమతస్థులు నివసించిన గుర్తులు, గుళ్ళును కలవు.

భద్రాచలమునకు తూర్పున నూరుమైళ్లలో గుండాల వద్ద గోదావరిలో నుష్ణగుండములు కలవు. ఇది యాదిశేషుడు బహుకాలము హోమ మొనరించిన స్థల మని బ్రహ్మాండ పురాణమున కలదు. భక్తులు నిటనాడి వత్తురు.

ఇంకను సిగ్రామమందేమి, సమీపములందేమి పూర్వమున మహానుభావు లారాధించిన దేవాలయములు, స్థలములు

జ్ఞాతములుగను, నజ్ఞాతములుగను పెక్కు గలవు.

ఆంధ్రప్రదేశ దేవాదాయ ధర్మాదాయ శాఖా మాత్యులు గౌ॥ శ్రీ కల్లూరు చంద్రమౌళిగారి అధ్యక్షతను ఆలయమున కొప్పు డొక ఉద్ధరణసంఘ మేర్పడి ఆలయమును మహాశోభావంత మొనర్ప నిపుణులచే బృహత్ప్రణాళికముల తయారు చేయించి దాతలనుండి భూరివిరాళముల సేకరించి మహాభక్తులును సుసమర్థులు జ్ఞానవృద్ధులునగు పండిత శ్రీమాన్ శ్రీ మత్తిరుమల గుదిమెళ్ల వరదాచార్యులుగారి శ్రద్ధాసక్తులతో నడిపింపబడుచున్నవి. శ్రీ చంద్రమౌళిగారు లౌకిక రాజకీయ ప్రజ్ఞాధురీణులే కాక 'శ్రీ రామాయణ సుధాలహరి'ని ఆంధ్రుల కందించి దివ్యబోధ మొనరించిన భక్తశిఖామణి. శ్రీమాన్ వరదాచార్యులుగారు దాశరథీశతకమును సంస్కృతమున భాషాంతరీకరణ మొనరించిన మహాభక్తులు. ఈ యుభయుల కార్యదీక్ష నిర్యోడ ప్రవర్తించుటచే ననతి కాలములో భద్రాచలము భోగవిశేషములలో దోగాడి రామభక్తి కాలవాలమై కలియుగ వైకుంఠమను పూర్వపు పేరు స్థిరీకరించుకొనగలదనుటలో సందియములేదు.

ఏవంవిధ మహిమాన్వితమగు నీభద్రాచల క్షేత్రము నుతిపాత్రమై ఆచంద్రార్కము భక్తజనసేవ్యమై విజయవంతమగుగాత!

శ్రీరామచంద్ర శ్శ్రితపారిజాతః । సమస్తకల్యాణగుణాభిరామః ।
సీతాముఖాంభోరుహచంచరీకః । నిరంతరం మంగళ మాతనోతు !

అనుబంధము – 1.

# శ్రీ భద్రాచల
# శ్రీ సీతారామచంద్రస్వామివారి
# దేవస్థానమునందలి శిలాశాసనములు



## 1. రామ స్తంభం.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశక వర్షం బులు ౧౫౭౪ అగు నేటి వర్తమాన వ్యవహారిక చాంద్ర మాన నన్దననామ సంవత్సర చైత్ర శు ౯ భానువారం శ్రీభద్రాచల సీతారామచంద్ర మహాప్రభువు వారి సంన్నిధిన శ్రీరామదాసుగారు శ్రీ తానీషాగారి అనుమతం వెంబడిన జరిగించ్చిన దేవబ్రాంహ్మణ వృత్తులు శ్రీవారి సంన్నిధిన జర్గే ఉత్సవ ప్రకరణములు వ్రాశివున్న శాసనం ధంసా ప్రపంచ్చ ములో శ్రీవారు పోలవరం వలస వెంచ్చేసినప్పుడు వక దుమార్గుడు శాసనం చెక్కివేసి నందున సర్వజనులకు తెలిసి సంత్తోషించ్చేటందుకు లేకపోగా దుర్మార్గుడు పుత్ర మిత్ర కళత్రాదులతోటి నశించ్చిపోయినాడు. తదనంత్తరం శాలివాహనశక వర్షంబ్బులు అగు నేటి ౧౭౫౪ నన్దన నామ సంవత్సర చైత్రశు॥ ౯ ఇందువారం భద్రగిరివర్ద రామ దాసు అనె రామదాసుహంశను జన్మించిన భక్తుడు కంచ్చి

నగరం నుంచ్చి శ్రీ భద్రాద్రికి వచ్చి తనకు తన భార్యాకు గల సకల ఆభరణములు ధనము శ్రీవారికి అర్పణ చెశి ఆయన తల్లి అయిన రంగమ్మ అనె మహా భాగ్యవతి అను మతం వెంబ్బడి ఆత్మకుటుబంత్రోకూడా హరిదాసులై స్త్రీలు సంమ్మార్జన కయింకర్యములున్నూ ఫురుషుడు భజెన మొద లయిన సెవాదులున్నూ జర్గిస్తుండ్డగా శ్రీవారు నాసరుద్ధ ఫులా వారి నవాబుగిరిలో చందూలాల్ అనె భగవదంశ సంభూతుడ్కి స్వాప్నమంద్దు దర్శనం కృపచెశి వరదరామ దాసు రామదాసుగారి హంశ్య అనిన్ని హాసనాబాదు పర గణా శ్రీవారి మొహారుతోటి వరదరామదాసు దస్కతు తోటి అమలు జరిగించ్చ వలసిందనింన్ని అదివరకు దుర్మా గులు ప్రపంచ్చ పరిపాలన చెసుటచాతను దెవబ్రాహ్మణ వృత్తులు నిరాటంక్కంగా జరుగుటం లెనంద్దున అవి విమ ర్శగా జిరిగిచ్చవలశినదనిన్ని ఆజ్ఞయిచ్చినంద్ను చందూ లాల్ అనె భగవదంశ సంభూతుడు అతి భక్తియుక్తుడై భగవదాజ్ఞ ప్రకారం దెవబ్రాంహ్మణుల అగ్రహారాలు వృత్తులు రుసుంలు నజలుర్ మొదలైనవి గ్కా అమాని గ్రామాదులు ౪౪ సరబస్తాలు ౧౧ సాయరున్నూ శివాయి బాపతులతోకూడ ౭౧ డెబ్బయివక్క వెయ్యి చలామణీ రూపాయీలుక్క హాసనాబాదా పరగణా రకం మొరుపరిశి అంద్కుగా ౩౨ వెలు సర్కారుకు నగదు చెల్లించెలాగున్ను మున్నూ ౧౦౦ జనం శిబ్బంద్దితోపు శ్రీవారి సంన్నిధిలో

తయినాటీ వుండెలాగున్నునున్నూ వారికి ౧౦౦౦ వేల రూపా యిలు ప్రతిసంవత్సరం జీతాలు యిచ్చేలాగునను, ౧౧౫౦౦ శ్రీవారి కైంకర్యముక్రింద జరిగేటట్టున్ను, ౧౨౫౦౦ సాదరు శిబ్బంది దరబారు వ్రయం నిమిత్తంగాను నిర్ణయం చేశి అమలు వరదరామదాసు పరం చేసినారు. గనుక భగవదను గ్రహపాత్రుడైనా రాజా తూము లక్ష్మీనరశింహ్వారామదా సున్ను వరదరామదాసున్నూ శ్రీవారి ప్రెరణ వెంబ్బడీ హసనాబాదా పరగణాలో వుండ్డె దెవ బ్రాహ్మణ వృత్తులు అగ్రహారములు విమర్శించి సర్వ్వదుంబాలా జర్గలంద్దులకు యెరుపాటు చెశిన వివరం.

శ్రీ వా రి అ గ్ర హా రా లు.

౧ శ్రీ భద్రాచలం ౧ మల్లూరు ౧ కొత్తగూడెం
౧ నృశింహ్వానగరం ౧ త్రిపుర పంట్ల పీడు

౧ స్తానాచార్లవారు

తిరుమలవెంకట రామానుజాచార్లగారు వెంకట తాతాచార్లగారు రావిగూడెం ౧ నృశింహ్వాభట్టరు అయ్యా వార్లంగారు దండెనము ౧ సర్వజ్ఞభట్టరు అయ్యావార్లం గారు రెగుబిల్లి ౧ కందాళ బంగారురామానుజాచార్లగారు కత్తిగూడెం ౧ అద్దంకి తిరుమల రంగాచార్లగారు పినపల్లి ౧ ధర్మపురి తిరుమల రామానుజాచార్ల అయ్యావార్లంగారు గంగ్రదగొడ్డంళ్ళపల్లి ౧ తిలుమల వెదాంతాచార్లవారు

విరివెండి ౧ భగవద్భాగవత కయింకర్యపరులు అయిన అమరవాది చెన్నకృష్ణమాచార్లుగారు దేవరపల్లి ౧ గొట్టి పుళ్ళ బుచ్చయ్య ఆచార్లుగారు సింగవరం ౧ శేషం నరసింహాచార్లుగారు రామానుజాచార్లుగారు రామానుజా చార్లుగారు సంగెం ౧ కాండూరి వెంకట రామానుజా చార్లుగారు బ్రాహ్మణ వేముల ౧ శఠగోపం నరశింహాచార్లుగారు కొత్తగూడెం ౧ ముడుంబ నరసయ్యగారు దుమ్ముగూడెం కృష్ణవరం ౧ సామవేదం తిరువెంగళాచార్లుగారు మల్లవరం ౧ అమరవాది రాగయ్యగారు లింగాపురం ౨౧ స్వామి స్వాముల అగ్రహారాలు.

1. బ్రాహ్మణుల అగ్రహారాలు.

౧ అమరావతి అమరేశ్వరస్వామి వారికి దత్తైలబోర్న ౧ దుభాష జగ్గయ్య జోశ్శికులమేది కేశవపురం ౧వఝుల సుబ్బయ్యగారు గోగుబాక కృష్ణసాగరము ౧ అంత్రవేది జోగయ్యగారు సీతంమ్మపేట ౧ దేవరకొండ వీరయ్యగారు మడివేరు వీణె నృశింహ్వా దీక్షితులుగారు రామయ్యగారు కొలనుగూడెం ౧ మావిలేటి వెంకటనర్సు మల్లాది సోమన్న అంత్రవేది జోగయ్యగారు నడికుడి ౧ కానూరు లక్ష్మయ్య ముత్తన్నగారు గంగోలు ౧ మావిలేటి యజ్ఞన్నగారు చింతలగూడెం ౧ భీమవరపు రామయ్య సుబ్బయ్యగార్లు సీతారామపురం జగన్నాధపురం ౧ దెవారం పాపయ్యగారు బండారుగూడెం ౧ అనిపెద్ది రామయ్యగారు పట్టెవర్ధనం

సూరయ్యగార్లు పెగళపల్లి తిరుమలాపురం ౧ కొచ్చెను పద్మనాభ యోగీశ్వరునిగారు గుళ్ళశింగారం.

3. అ వ ధా న ప రు లు

౧ అవధానుల జగ్గయ్య అన్నవరం బ్రంహ్మచారి మర్రిగూడెం ౧ అల్లం కాళహస్త్రి బ్రాంహ్మణపల్లె ౧ చిలుకూరు శెషయ్య కెశవులు జెములగూడెం కాముని గూడెం తీర్థాల వెంకట్రామన్న మద్దులగూడెం ౧ కొండుభట్ల వెంకటశాస్త్రులు తోగుగూడెం ౧ శ్రీవారి వకీలు గౌరవరపు నారాయణదాసుకున్నూ నారాయణరావుపేట అగ్రహారం నెల ౧కి ౩౦ ముప్పది రూపాయలు పట్టివర్ధనం వెంకటశాస్తులుఁ అన్నవరం ౧ మాగంటి సుబ్బయ్య రంగాపురం నరుసన్నపాలెం అగ్రహారంలు ౨ గరిమెళ్ళ బాలయ్య మూర్తెయ్య కుమ్మరగూడెం చెవుడుభట్ల గురవయ్య పాముళ్ళపల్లి చక్రవతుఁల రామానుజాచాలఁగారు ఉప్పపాక ౧ కేశవపట్టం మల్లాది శెషాచలం సోమయాజి శాయన్న కొయ్యగుట్ట ముగ్గు జోగయ్య రామచంద్రుడు మలఁ సోమన్న మద్దులపల్లి.

4. దే శ పాం డ్యా గ్రా మా లు

భీమవరం సూరవరం గుండాల శెట్టిజేరుపల్లె రఖం ఖ ౧౨॥౦ వరి జొన్నమాన్యాలు రు ౧౦౦కి ౨॥౦ రుసుమ్న వున్నది శ్రీవారి కైంకర్యార్థఁం హాసనాబాదా పరగణాలోని

గ్రామాదులలో పుట్టి యిర్నలు బహుకాలంనుంచి మామూలు జరుగుతూవున్న దేవబ్రాంహ్మణులకు హసనాబాదా పరగణాలో వుండుకున్న యీనాములకు స్న ౧౨౮౧ ఫసలీలో దరియాప్తుచెశి శ్రీవారి మొహారుతోటి స్నదులు యిచ్చివున్న ప్రకారం వరిజొన్న పొలాల యీ ఖుం ౧౦౦ ఖండీలు శ్రీవారికైంకర్యార్థణం సాయరులోను రుస్సులు రు ౧కి ౦౮-అణా చొ॥ అడ్డాదికి మామూలు రు ౧౦౦ — రు ౧౦౦కి ౫ చొబీనా మామూలు జరుగుతూ వున్నది. బెవారసు అగ్రహారాలు మాన్యాలు శ్రీవారికి చెందవలస్నివి. శ్రీవారి కైంకర్యం నిమిత్తం జర్గె మాన్యాలు ఖ ౦||౦ శ్రీ భద్రాచలం తా॥ ౦|౦ రాయినిపేట ౦|౦ చోడవరం ఖం ౧౮-౨౪ శీతారామనగరం ఖం ౪౦ బూరగమ్ముల్లపాడు ఖం ౦|౦ శీతారామనగరం ఖం ౦|౦ వెలేరు ఖ ౦౮-౨॥ దంత్తెలబోర ఖ॥ ౦||౦ పాలవంచ తా॥ వరి ఆబి ఖం ౫ పెదనెల్లిపాక తా॥ ఖం ౨||౦ ఆబివరి ౨||౦ తాబీ వరి ౨|||౦ తా॥ రామాంజవరం ఖం ౨ వరి యీ ఖుం ఆబితాబి ౦|||౦ జొన్నమాన్యం ౧ తా॥ మల్లూరు ఖ ౦||౦ రాజుపేట ౦|౦ తొండిపాక అమరవరం ౦||౦ తొండిపాక జొన్నపొలం కాజివారిది మోతే ౧ కాశ్యాం ద్విజానాం సహస్రం భోజయిత్వాతు యత్ఫలం। తత్ఫలం భద్రశిఖరే ద్విజస్యైకస్యభోజనాత్॥ చెన్నపట్నం కాపురస్తుడయిన్న నాగెండ్ల శెషాచెలం అనె పరమభక్తుడి ధర్మం సన్నిధిలో అభివృద్ధి సదా అగుగాక।

### శ్రీ లక్ష్మణ స్తంభం

శ్రీ వారి వుత్సవములు ఆరగింపులు మొదలయినవి యీ క్రింది ప్రకారం భక్తియుక్తంగా పూర్వక్రమంగా భగవదాజ్ఞ వెంబ్బడి జరిగించ్చనయినది.

౧ ప్రబోధశాల ౨ దంతధావనశాల ౩ తిరుమంజన శాల ౪ కృతకర్మఫలోత్సవశాల ౫ బాలలీలామహోత్సవ శాల ౬ జగత్స్వరూపోత్సవశాల ౭ ప్రకాశవుత్సవశాల ౮ ప్రభుత్వశాల ౯ మహారాజశాల ౧౦ పర్యంకశాల - యివి నిరంత్తర వుత్సవములు.

బాలభోగమునకు దశవిధముల ఆరగింపులు

౧ ఘృతపొంగలి ౨ షెక్కరపొంగలి ౩ పొంగలి ౪ పులిహోర ౫ దధ్యోదనం ౬ ఖజ్జకాయలు ౭ తిరువనం ౮ దోశెలు ౯ తేనెతొలలు ౧౦ ఎర్రతైరుప్రసాదం ౧౧ పూర్ణ తళిహాకుప్రసాదం ఖం 083 దధిఘృతసూప సమూపేతంగా నునూన్నా చుట్టుకో వెలలకు అనేమిషచాత అచకజీవనాధకాం రోజు ౧కి ఖ 08౨ బియ్యాం పాళ్ళ ౪౦ కి నలుభైయింట్కి రామసత్రములో బ్రాంహ్మణ భోజ్నం నిమిత్తం ఖ 08౧8 బియ్యాం దానికి దగిన రసవగాలు నిరంతరం జరుగుతూ వుండే నిర్ణయం హరిదాసులకు అక్షయ పాత్రలకు శే తొమ్మిది శేలక బియ్యాం.

5. నిరంత్తర మాసోత్సవములు.

౧ పౌర్ణమి గిరిప్రదక్షిణోత్సవం ౨ శుక్రవారం బంతు

లాట వుత్సవం ౩ పునర్వసుమంటప వుత్సవం ౪ యేకాదశి తూర్పుమంటపంలోకి తిరువీధి వేంచేపు ౫ అమావాశ్య కోవెల వుత్సవం ౬ సంక్రమణములు. క్రమంగా సంవత్సరోత్సవములునూ౽.

౧ చెయిత్రమాసంలో తిరు కల్యాణమహోత్సవం బ్రాహ్మణ భోజనం సదావర్తులు ౨ వైశాఖమాసంలో నృశింహ్వాస్వామి కల్యాణోత్సవము శ్రీవారి పౌర్ణమిరోజు పురప్రదక్షణంగా వేంచెపు ౩ జ్యేష్టమాసములో జ్యేష్టాభిషేక ఉత్సవము ౪ ఆషాఢ శు ౧౫ లు పురప్రదక్షిణంగా రామదాసు మండపం రంగమంట్టపం మీదుగాను ౬ శ్రావణ మాసములో గోకులాష్టమి వుట్ల పండుగ అమ్మవార్ల వారి నోముల శుక్రవారంకు ౧౦౦౦ రవికెలు ౭ ఆశ్వయుజ మాసంలో దసరావుత్సవము ౮ కార్తీకమాసంలో దీపోత్సవం పదిరోజులు జగన్మోహనావతారం పురప్రదక్షిణ ౯ మార్గశిర పుష్యమాసములు ధనుర్మాసం అధ్యయన వుత్సవములు ౧౧ మాఖమాసం సహస్రఘటాభిషేకవుత్సవం ౧౨ ఫాల్గుణ మాసంలో డోలోత్సవం సంవత్సరాదికి పెండ్లికుమారుణ్ణి శాయటం యీప్రకారం ఉత్సవములు యథావిధిగా జరిగించవలసినది.

అశ్వారావువారు రు౫౦౦ దేశపాండ్యాలు రు ౧౫౦ హుజూరు చందులాల్‌గారు రు ౨౦౦. వుజాగరు చందుగారు ౩౦౦ రాజేశ్వరావుగారు ౨౫౦ జరిగించే మరియాదవున్నది

హరిదాసులు డబ్బీలమూలంగా ఆర్జించి తెచ్చి సమర్పిం
చుట కలదు. ఇంకా భగవదానుగ్రహంగలవారు సమర్పిం
చడం గలదు. యిది అంతా చయిత్రమాసంలో అన్నదానం
సదావర్తి వినియోగం శాయవలసినది. వుత్సవములో శ్రీ
వారి సన్నిధిని వచ్చె పాదకానుకలు ఆవరణములో యేమి
వచ్చినా అర్చకులు నలుభై పాళ్ళు వారిదిగాని స్వామి కైంక
ర్యంలోకి తేవలసిన పనిలేదు. శ్రీవారి సంన్నిధిలో యావద్వ్యా
వహారములకు అర్చకుల హరిదాసుల స్వతంత్రంగాని దేశ
ముఖ దేశపాండ్యాలకు యెంతమాత్రం స్వతంత్రంలేదు. శేవకు
కైంకర్యమునకు అందరు స్వతంత్రులుగాన తెలిసేది. ఖజానా
కాపాడేటి దేవస్తలముకు నాలుగు భాగములా పహారాలు
వుండవలసినది. సన్నిధి అయిదుగురు వెండిబెత్తాలవారుండెది.
సవారి బయలు తెరిసినప్పుడు యెక్కడెక్కడ పహారాలు
వుంచవలసినది. సదా జాగ్రత్తగా వుండవలసిన స్తళంగన్క
యెసురశి వుండకూడదు భద్రగిరి వరదరామదాసుకు తూము
లక్ష్మీనరసింహ వరదరామదాసుగారి నాటి మామూలు వెం
బడి స్వామి అజ్ఞ వెంబడి స్తలానికి కయింకర్యవుద్ధారకులు
అయినందున్న అర్చకభాగమున్నూ పెద్ద అర్చకత్వము కృప
చేశినారు. వీరి పరంపరదాససంతతి జర్గగలదు. శ్రీవారి దివ్యా
భరణములు దివ్యాలంకారంలు భవ్యాలంకారం నవ్యాలం
కారంకుగాని నియమించి వున్నవి గన్క యిందులో ద్రవ్యం
హరించినవారు వంశనాశనం కాగలరు. యీ శాసనంలో

వ్రాశివున్న ప్రకారము దేవబ్రాంహ్మణ వృత్తులున్నూ వుత్సవాదులున్నూ శ్రద్ధగా జరిగించినవారికి

అపత్యం ద్రవణం దారాహార హార్మ్య హయా గజాః।
సుఖాని స్వర్గమోక్షౌచ నదూరె రామభక్తతః॥

శ్రీవారి సంన్నిధిలోవుండే గుఱ్ఱాలు ౫ యేనుగులు ౨ దర్శన ధేనువ ౧ సత్రపుయిడ్లు ౨ పుష్పాలతోటలు ౫ కః వూ. యీ స్థళంలో నిర్ణయంగ్గా ఉండ్డే పరిచారకజనం—

౧ నవుబతుఖానా, ౧ జయరాంభేరి, ౧ తాషామర్ఫ ౧ అలుగోజాలు ౧ ఢంకా ౧ నగారా ౪ హారిదాసులు, ౫ గుమస్తాలు ౧ హైదరాబాదు వకీలు ౬ హధ్యాపకులు ౬ తీర్థస్వయంపాకులు ౨ తిరుపణియారములు చేశేవారు ౧ పిండి రుబ్బేవారు ౪ సీతారామసత్రములో వంట్లబ్రాహ్మలు నీళ్ళబ్రాహ్మలు ౧౫ తోమాలలుకట్టే చాతానులు ౧ కుంభార్తికట్టే చాతాని ౧౬ కుండుతాలవారు ౧౦ బిళ్లలవారు ౨ తెలగబంట్రోతులు ౪ వెలంవారు ౩ కొత్వాళ్ళు ౪ ఘడియార్చీలు ౧ పాలుకాచేవారు ౨ చోపుదార్లు ౨ సమ్మార్జనపరులు ౫ కీర్తనలుపాడేవారు ౨ చవురిలు వేశేవారు ౨ సుతాలుర్ ౨ వడ్లవాండ్లు ౪ యేనుగులమావంతులు ౧౦ కమాటీలు గుఱ్ఱాలసఫయి ౯ వంటెసార్వానుకోట్యాలు ౩ భోగంమేళం ౪ వోడకారీలు ౮ భోయీలు ౧ తిరుచునార్ణలు పట్టేవారు ౧ కనార్ణబిలు ౨ హారణాలాలు

౮ గలందాజులు ౨ ఫరాషులు ౨ తప్పేలాలుతో మొ౨సత్రపు దాసీలు ౨ టపాజవానులు ౮ మషాల్చీలు. గల్లా జీతాల వారికి సాలు ౧కి ౧౨౦ ఖండీలు ౬౦౦ నగదు రూపాయిలు యీ మట్టుకు సన్నిధి అచ౯కుల భాగాలు ౮౦.

శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయకులయిన శ్రీ భద్రాచల సీతారామచంద్ర మహాప్రభువ్వారి ఆజ్ఞాధారులయిన రాజా తూము లక్ష్మీనృశింహ్వారామదాసు నిరాచ్ఛేదంగా దేవబ్రాంహ్మణ వృత్తులు పునరోద్ధారం చేసి రామలక్ష్మణులు అనే స్తంభములమీద శాసనములుగా వ్రాయించిరి. సర్వజనులు ధర్మం యందు దృష్టివుంచి తెలుసుకోనవలశినది యీ ధర్మం జరిగించ్చినవారు.

శతపూర్వేషాం శతాపరేషాం పురుషాణా మనంతకల్పకోటి విష్ణులోక ప్రాప్తిస్సి శాశ్వితయశస్సున్నూ పొందగలరు. బందగాని ఆలివారి ఆలి దరబారు క్షేమంకోరె ముసలుమానులు యిందుకు విరోధం శాయబోరు హిందూకులస్తులు దేవబ్రాంహ్మణుల యందున అతిశయభక్తి జర్పి వంశాభివృద్ధిని పొందగలరు. హాసనాబాదా పరాగణాలో వున్న దేవబ్రాంహ్మణ అగ్రహారములు యీనాములు అంచనా చూపించినవారు కంచరగాడిద కడుపున పుట్టగలరని ప్రమాణం పూర్వపు శాసనస్తంభంమీద వున్నది.

గోవులకును బ్రాంహ్మణులకు దేవతలకు—నెల్ల ప్రొద్దు

తెంపున కీర్తిగాంచు పాపమానస మేవిధమున బుట్టకుం డయే వాంఛింతును.

యొభూమిపాస్నతత ముజ్వల ధర్మచింత్తాః
మద్వంశజాః పరమపాపతి వంశజావా
మద్ధర్మమేవ సతం పరిపాలయంతి
తత్పాదుకద్వయ మహం శిరసా వహామి॥

గిరిప్రదక్షిణ ఫలం — భూప్రదక్షిణాత్రయ ఫలం
పురప్రదక్షిణ ఫలం — జగత్రయ ప్రదక్షిణ ఫలం
హరిప్రదక్షిణ ఫలం — అమితం.

శ్రీ శ్రీ శ్రీ



---

ఈ శాసనమున రామదాసుగారు వ్రాయించిన శాసన స్తంభముల కాలము శా.శ. 1574 (క్రీ.శ. 1652) అని యున్నది. రామదాసు తానీషాల కాలము 1652–1687 అని కొందరు భావించిరి. కాని కృష్ణాజిల్లా చరిత్ర కారుడేమి, యితరులేమి, తానీషా 1669లో రాజ్యమునకు వచ్చినట్లు తెలిపి యున్నారు. తానీషాయే రామదాసుగారి కీ ప్రాంతాధికార మిచ్చినట్లును రూఢిపరచిరి. కనుక రామదాసుగారి కాలము 1670–1687 అనియే స్థిర పరచితిని.

అనుబంధము—2.

# శ్రీ భక్త రాజా వరదరామదాసుగారి చేవ్రాలు గల హుకుం

శ్రీ భద్రాచల రామచంద్ర మహాప్రభువు వారు

శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయకులయిన్ను శ్రీ భద్రాచల సీతారామచంద్ర మహాప్రభువ్వారి ఆజ్ఞాధారకులయిన మహారాజశ్రీ రాజా తూము నరసింహ్వా రామదాసుగారి దాసానుదాసుడు భద్రగిరి వరదరామదాసు శ్రీ మహాప్రభువ్వారి సన్నిధిలో పెద్ద అర్చకులయిన్ను శ్రీమాన్ అమరవాది చన్న కృష్ణమాచార్యులుగారికి వ్రాయించ్చిన హుకుం.

౧ ప్రబోధశేవకు లోగా బీగముద్రలు తియ్యగానే పెద్ద అర్చకుడు సర్కారు తరఫు దారోగా హరిదాసులు వంతు అర్చకుకు వీరు యేకాంత్త గృహములోకి వెళ్ళి శ్రీ మహాప్రభువ్వారి విభవం సేవించి శ్రీ పాదముల యంద్దు వుండ్డే హాలకులిశాది రేఖలు వుండ్డ చూచుకోవలసినది. అయిదవారు రాజస్తానం గన్కు యుక్తమయినవారికి శలవు ప్రకారము సేవ లభింప్ప చేసేది.

౧ ప్రబోధశేవ యథావిధిగా జరుగుతూ వున్నది సరికదా సేవవేళ్లకు ఛత్రచామరములు శిధముగా వుండవలనది. యేనుగ పెద్దగుఱ్ఱము కోవెలదగ్గర ఉండవలసినది. ఢంకా నిమిత్తంలేదు. ప్రబోధసేనలో వకపళ్లెములో దువ్వెన కాటుకకాయ అద్దము యివి వుంచ్చి సన్నిధిలో వుంచ్చవలసినది.

౧ బాలభోగము యథావిధిగా జరుగుతూయున్నది. సరే ప్రభ్వువారి యర్ర తైరుప్రసాదము ఘృతపొంగ్గలి షర్కరపొంగ్గలీ అరసోల - సోల తిరువసందోశెలు యివి ఆరగింప్పు కావలసినది. దోశెలమీద వెన్నవుంచి వెండి పళ్ళెంతోటి ఆరగింప్పు కావలసినది.

౧ మున్నువుంన్న గింన్నెలలో పెద్దగింన్నెగా విచారించి షర్కర పొంగలి వుంచ్చవలశినది.

౨ పెద్దగిన్నెలు రెంట్టిలో యెర్రతైరుప్రసాదము ఘృత పొంగ్గలి వుంచవలశినది.

౧ నరశింగ్గరావుగారు చేయించ్చవలశిన వెండిగిన్నె చేయించిరా సరే లేదా రు ౮౦ యనభై రూపాయలకు వక గింన్నె జరూరుగా చేయించ్చి తిరువీసము వుంచ్చేది.

౧ సత్రములో వుండ్డే వెండిపళ్ళెం తెప్పించి దోశెలు వుంచ్చేది.

౪ యీ ప్రకారము జరిగించ్చేది.

౧ నాయకతళిహా తదియ్యారాధన యథావిధి జర్గించ వలసినది.

౧ ప్రకాశోత్సవమువరకున్ను యేకాంత్రమున్ను అమ్మవారు శేవచేసేకాలము గనుక బాదామిఫలముల పప్పు ఖండ షర్కర తుకె ఆరగింప్పు చాయవలశినది. బంగ్గారు గిన్నెల తోటి చామరకైంకర్యము నిశ్శబ్దముగా జరిగించ్చవలశినది. వంతు అర్చ్చకుండు హరిదాసు పెద్దఅచకుడు దారుగా వుండ్డి స్తానాచార్యులు — అధికారి యింకా వకరు యవరయినా శేవించ్చతగును.

౧ ప్రభుత్వశేవ యథావిధిగ జరగటములో వెండి కలం దాను బంగ్గారు కలం సిరాబుడ్డి సనేరి కాగిదం బంగ్గారు మొహరు చక్కను యివి సాన్నిధిలో పీట వుంచవలశినది. ఇది నిరంత్తరం మరియాదా.

౧ యేనుగలు గుర్రాలు శా బనిలేదు కానీ — యేనుగు గుర్రము సాయంత్రిమందు శేవాకాలము యథావిధిగా మర్యాద వెంబడిని శేవలు జరిగించ్చవలశినది.

౧ యేకాంత్ర శేవలు కట్టువెంబడిని శేవచేశి భయం కలిగి బయటికివచ్చి వంత్తు అచకుని తాళం వకటి సత్ర మర్చ్చకుని మరుతాళం వకటి బీగముద్రలు వేశి సర్కారు తాళం పెద్ద అర్చ్చకునివద్దనయినా దారుగావద్దనయినా వుం

చ్చేది. వుదయాత్పూర్వమే యధావిధిగా వెళ్ళి హాజరువుండి యధావిధిగా జరిగించేది.

౧ శుక్రవారము యేకాదశులు అమావాస్యలు పౌర్ణవములు మొదలయిన్ని కోవెల వుత్సవములకు పది విలాయిలు వేయించ్చి మూడు ప్రదక్షిణములున్ను వక ప్రదక్షిణం హరిదాసులు నృత్యం – వక ప్రదక్షిణం భోగమువాండ్ల నృత్యం వక ప్రదక్షిణం సకల విభవములతోటి హెచ్చిరికలతోటి మందిరము ప్రవేశించ్చవలసినది.

౧ పునర్వసు వుత్సవము యధావిధిగా జరిగించవలశినది.

౧ తిరునక్షత్రములు మొదలయినవి యధావిధిగా జరిగించవలెను.

౧ అధ్యయనోత్సవములకు గోవిందరాజుల కోవెల దగ్గిర కోటా వేయించేది. పునర్వసు మంటపముదగ్గిర కోటా వేయించేది. కోవెలలో కొతా వేయించ్చేది. చుట్టూమోకాటి యెత్తుగోడ పెట్టించ్చి ద్వాదశి మంటపం మీదినుంచ్చి జన పడకుండ్డా కటకటా కట్టించేది. పిస్తారము పందిరి వేయించి మధ్య శింహాసనం వేయించి నాలుగు స్తంభాలు కట్టి శృంగారం చేస్తే ముక్కోటి యేకాదశినాడు వుదయాత్పూర్వం అక్కడికి వేంచేశి బాలభోగము వేళ్ళకు తిరిగి కోవెలలో ప్రవేశించేటట్టు మర్యాదచేశేది. నిరంతరం వుదయకాల

వుత్సవము పదిరోజులు పునర్వసు మంట్టపములోనే రాత్రి వుత్సవము పదిరోజులు గోవింద్దరాజుల కోవెలలో కాగా నిర్ణయించేది. శేషమాపు వుత్సవములుగాక కోవెల శేవలు వేరే జాగ్రత చేశేది. యిది వక కటాదిట్టము.

౧ దశెహారా వుత్సవములు యథావిధాగా మామూలు ప్రకారము.

౧ తిరుకల్యాణ వుత్సవము డోలావుత్సవము సహస్ర ఘటాభిషేకము యధావిధిగా జరుగగలందులకు సహస్ర ఘటాభిషేకమునకు గావలశిన యాగద్రివ్యము తపీస్లు వ్రాయించ్చి వుంచ్చేది.

౧ అధ్యయనోత్సవములలో వచ్చిన యావజ్జనానికిసత్రములో అన్నాదికములు, భోజనము పెట్టించ్చేది. సన్నిధిలో వైదేశికులలో పదిమాన్నైలు యక్కువచేశేది తళిహ మామూలు ప్రకారము ఏమి విశేషము వుండేదో ఆ ప్రకారము జాగ్రతచేశేది. నాయక తళిహ యిద్దున్నిరస (౧౦౦ శేర్లు) ఆ దినములలోకూడా చేశేది

౧ తెల్లవస్త్రములు కనుమాసినవి ధరియింప్ప వద్దు. స్వామి వారికి కట్టినబట్టలు తిర్గి స్వామివారికి ధరించవద్దు. జాగ్రత్త.

౧౬ పదహారు నెంబలలో వ్రాయించిన పద్ధతులు పూరాగా ఆకలింపులోకి, తెచ్చుకొని యేయే కాలములో

జర్గే కైంకర్యములు యెడల లోపం రాకుండా జర్గింస్తువుండ్డ వలసినది.

ఖరనామ సంవత్సర కార్తీక శు ౯ ఆదివారం.

(ద)॥ భద్రగిరి వరద రామదాసు - అని వున్నది.



వరదరామదాసు ముద్రిక, చేవ్రాలు

అనుబంధం - 3.

## కొన్ని ముఖ్య తేదీలు:

1626— అశ్వారావువారు పాలవంచ హసనాబాదు పరగణాలకు మనసబు పొందుట.

1669— గోలుకొండ నవాబు అబ్దుల్లా మరణింప తానీషా నవాబగుట.

1670— రామదాసు (గోపన్న) పరగణా అధికారిగా వచ్చుట.

1674— రామదాసు ఆలయనిర్మాణముచేసి జైలుకు వెళ్ళుట.

1686— జైలునుంచి రామదాసు విడుదల అగుట.

1687— తానీషా ఔరంగజేబుచే పట్టుబడుట.

1724— నిజాముల ముల్కు మొదటి నైజాముగా హైదరాబాదు వచ్చుట.

1748— నిజాముల ముల్కు మరణించుట, నాసరుజంగు రాజగుట.

1750— నాసరుజంగు మరణించుట, ముజఫ్ఫరుజంగు రాజగుట.

1751— ముజఫ్ఫరుజంగు మరణించుట, సలాబతుజంగు రాజగుట.

1763— నిజామలీ రెండవ నైజాముగా సుస్థిరుడగుట.

1766— ఇంగ్లీషు కంపెనీవారు ఉత్తర సర్కారులను కవులు తీసికొనుట.

1769— ధంసాపాలన, దురాక్రమణలు.

1769— భద్రాచలం ఉత్సవమూర్తులు పోలవరం వలస వేంచేయుట.

1775— పోలవరం వలసనుంచి తిరిగి భద్రాచలం వేంచేయుట.

1776— మరల కమలాపురం (బస్తరులో) వలస వేంచేయుట

1782— ధంసా మరణించుట.

1785— శ్రీ స్వామివారిని తిరిగి భద్రాచలమున అశ్వారావులు ప్రతిష్ఠించుట.

1789— నిజామలీ (2వ నవాబు) దేవాలయ భృతి రు 40,000 నలభై వేలుగా నిర్ణయించుట.

1803— నిజామలీ మరణించి సికిందరుజా రాజగుట.

1829— సికిందరుజా మరణించి నాసరుద్దవులా రాజగుట.

1831— తూము లక్ష్మీ నరసింహదాసు చందూలాలుమంత్రి వద్దనుంచి అధికారమును పొందుట.

1790 తూము నరసింహదాసుగారి జననం.

1822 తూము నరసింహదాసు దక్షిణయాత్ర చేయుచు త్యాగరాజుగారిని కలుసుకొని భద్రాచలమున కాహ్వానించుట.

1832— శాసన స్తంభముల ప్రతిష్ఠ - నందన కరువు.

1833— వరద రామదాసు, నృసింహదాసు ఆదిగాగల భక్తుల వైకుంఠ యాత్ర. (గోదావరీ ప్రవేశం)

1835— రాజా చందూలాలు శ్రీ స్వామివారికి సనదు నొసంగుట.

1855— ప్రభుత్వమువారు విచారించి దేవాలయ భృతిని స్థిరపరచుట.

1859— శ్రీ అశ్వారావు గారికి పాలవంచను కవులుగా నొసగుట.

1860— ఇంగ్లీషువారికి ఉత్తర సర్కారులను నైజాం యిచ్చివేయుట.

1870— దేవాలయ కార్య నిర్వహణమును నైజాం ప్రభుత్వం స్వీకరించుట.

1874— మధ్యపరగణాల నుంచి భద్రాచలమును వేరుచేసి మదరాసులో కలుపుట.

1908— పోలీసు బందోబస్తు గోదావరి జిల్లావారు నిర్వహించుట, ఆలయ నిర్వహణమాత్రం నైజామువారు చేయుట.

1918— నైజాం సుబేదారు దేవాలయభృతి విచారణచేసి స్థిరపరచుట.

15-8-1953 గోదావరి వరదముంపు. 178అ. M. S. L

1-11-1953 ఆంధ్రరాష్ట్రావతరణము.

1956— ఆంధ్ర ప్రదేశావతరణము.

10-4-1957 గోదావరి పడవప్రమాదం 200 మంది దుర్మరణం.

16-12-1959 భద్రాచలంవద్ద వంతెన నిర్మాణ ప్రారంభోత్సవము

6-12-1958 భద్రాచల దేవస్థాన నిర్వహణ దేవాదాయ ధర్మాదాయశాఖ కైవసమగుట.

1960— ఆంధ్ర దేవాదాయ శాఖామాత్యులు గౌ. శ్రీ కల్లూరు చంద్రమౌళిగారి అధ్యక్షతన సీతారామాలయ సముద్ధరణసంఘ మేర్పడి బృహత్పథకములు నిర్ణయించి ప్రారంభము లొనర్చుట.